eng_JUN_1941_14_4

## వృషనామ సంవత్సర — జ్యేష్ఠ - ఆషాఢమాసములు

| | | |
|---|---|---|
| 1 | ఆ | ష మ12-55 ఆశ్రే మ2-6 రావ1-57ల3-31వ సప్తమీతిథి సాదు4-41ల |
| 2 | సో | స మ2-48 మఘ మ1-42 రావ9-29ల11-2వ అష్టమీతిథి పదు12-22 మదు2-58 |
| 3 | మం | అ ఉ10-17 పూఫ మ12-55 రావ7-49ల9-21వ ఉదు8-3 రాదు10-52ల |
| 4 | బు | న ఉ8-25 ఉఫ మ11-48 రావ7-46ల9-16వ పదు11-31ల |
| 5 | గు | ద ఉ6-19 ఏకా తె3-59 హస్త ఉ10-26 సావ5-55ల7-25వ |
| 6 | శు | ద్వా రా1-33 చిత్త ఉ8-55 మవ2-6ల3-36వ దినం 32-29 |
| 7 | శ | త్ర రా11-5 స్వా ఉ7-16 మవ12-28ల1-57వ ఉదు7-11వ శనిత్రయోదశి |
| 8 | ఆ | చ రా12-38 విశా ఉ5-35 అనూ 3-56 ఉవ9-18ల10-48వ సాదు4-43 |
| 9 | సో | ○ పూర్ణి రా6-19 జ్యే రా2-27ఉవ9-11ల10-41వపదు12-23మదు2.59 [10-55 |
| 10 | మం | బపా సా4-15మూరా1-16పవ10-3ల11-34వరావ11-47ల1-18వఉదు8-3రాదు |
| 11 | బు | వి మ2-25 పూషా రా12-19 పవ10-29ల12-1వ తిథిద్వయం పదు11-31 |
| 12 | గు | త మ12-57ఉషారా11-49ఉవ8-9ల9-41వరావ3-50ల5-26వదినం32-34 |
| 13 | శు | చ మ11-53 శ్ర రా11-42 రావ3-48ల5-26వ ఉదు8-3 మదు12-26 |
| 14 | శ | పం ప11-16 ధని రా12-5 వర్జ్యములేదు మిథునసంక్రమణము రా8-6 ఉదు7-12వ |
| 15 | ఆ | ష ప11-7 శత రా12-54 ఉవ7-32ల9-11వ సాదు4-44ల |
| 16 | సో | స ప11-32 పూభా రా2-18 ఉవ7-40ల9-22వ మదు12-25 తిర్రి దు 3-3 |
| 17 | మం | అ మ12-24 ఉభా తె4-5 మవ12-37ల2-20వ నవమితిథి ఉదు8-5 రాదు10.56 |
| 18 | బు | న మ1-42 రేవ పూర్తి సావ5-10ల6-55వ దినం 32-36 దశమీతిథి పదు11-33ల |
| 19 | గు | ద ప3-25 రేవ ఉ6-23 రావ4-29ల శూన్యతిథి ఉదు9-49 మదు3-2ల |
| 20 | శు | ఏ సా5-21 అశ్వి ఉ8-52 ఉశేవ6-13వ రావ7-33ల9-19వ |
| 21 | శ | ద్వా రా7-23 భర ప11-30 రావ12-50ల2-36వ ఉదు7-13వ |
| 22 | ఆ | త్ర రా2-19 కృ మ2-5 వర్జ్యములేదు సాదు4-47ల [పదు12-27మదు3-3 |
| 23 | సో | చ రా11-1 రో సా4-28ఉవ7-50ల9-36వరావ10-34ల12-18వ మాసశివరాత్రి |
| 24 | మం | ● అమా రా12-19 మృ రా6-31 రావ3-32ల5-15వ దినం 32-37వ |
| 25 | బు | శుపా రా1-14 ఆర్ద్ర రా8-11 వర్జ్యములేదు పదు11-34 |
| 26 | గు | వి రా1-33 పున రా9-18 ఉవ8-44ల10-16వ ఉదు9-51 మదు3-4 |
| 27 | శు | త రా1-25 పుష్య రా9-38 ఉవ5-32ల7-11వ ఉదు8-6 మదు12-28 |
| 28 | శ | చ రా12-43 ఆశ్రే రా10-5 ఉవ10-50ల12-26వ ఉదు7-14వ |
| 29 | ఆ | పం రా11-36 మఘ రా9-47 పవ9-56ల11-31వ సాదు4-49 [మదు3-5 |
| 30 | సో | ష రా10-5 పూఫ రా9-5ఉవ5-33ల7-6వరావ4-0ల5-32వదినం32-36పదు12-28 |

1941-వ సంll జూన్ నెల

### ముఖ్య పండుగలు

2. అగస్త్యాస్తమయము. 8. వైష్ణవ శ్రీ నృసింహజయంతి. 30. కుమారషష్ఠి.

# విషయసూచిక



త్రివర్ణ చిత్రము: గోపిక




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

---

# నవ భారతము - ఆర్య నారీగౌరవము

స్త్రీల పురోభివృద్ధికి సంబంధించిన సమస్యలు అనేకము గలవు.

విశ్వమానవ సౌభ్రాత్రము అలవడుటకు, విశ్వశ్రేయము చేకూరుటకు అవసరమైన పరిస్థితికి తగిన వాతావరణము ఏర్పడుటకు స్త్రీజాతియొక్క అధమస్థితి తొలగి, స్త్రీపురుషుల సమానత్వభావ మేర్పడుటయేకాక స్త్రీత్వమునందు స్త్రీలకు పురుషులకును గూడ గౌరవ ఆదరభావములు సమధికము కావలసియున్నది.

అసలు లోకకళ్యాణమునకు ప్రధానాశయములుగ నుండవలసిన స్వాతంత్ర్యము, సమానత్వము, సోదరభావము అను ప్రాతిపదిక సిద్ధాంతములపైన ఆధారపడి ఆందోళన జరిపినయెడలనే స్త్రీ ఉద్యమము కొనసాగి మహిళాఅభ్యుదయము చేకూరగలదు.

స్త్రీలకు పురుషులతోడి సమాన అవకాశములు హక్కులు ఉండవలెననుటకు ముందు, ఇంతవరకు స్త్రీలకు ఉన్న ఇబ్బందులు తొలగిపోవలెనని, స్త్రీలకు జరుగుచున్న అన్యాయములు మాన్పింపబడవలయునని అందరును ఒప్పుకొందురు.

స్త్రీలలో అవిద్య తొలగుటయేగాక స్త్రీలకు ప్రయోజనకరమగు ఉన్నతవిద్యా సముపార్జనమునకును అవకాశములు ఏర్పరచవలసిన విధిని బుద్ధిమంతులు ఆమోదించుచున్నారు.

బాల్యవివాహములు ఇకముందు జరుగరాదని ఇంచుమించు అందరును ఏకగ్రీవముగ తీర్మానించుకొనుచున్నారనే చెప్పవలెను.

వితంతు వివాహములకు అనుమతి అవకాశము సానుభూతి ప్రోత్సాహములు సమకూరుచున్నవనుట నిస్సందేహము.

తల్లిదండ్రుల యిష్టము బలవంతము వల్లనేగాక (పెద్దలు నిశ్చయించినారు గావున అనియేకాక) ఇతోధికముగ యువతులకు యువకులతోడి పరిచయమునకు ప్రేమాంకురమునకు కొంత అవకాశమేర్పడుచు స్వయంవర వివాహములు చేసుకొనుటకు తగు సంప్రదాయములు రూపొందుచున్నవి.

భార్యాభర్తల సమష్టి జీవనంలో విధివశమున ఒక్కొక్కతరి విషమ పరిస్థితులు సంఘటించుచుండుట సహజము. అట్టి పరిస్థితుల నెదుర్కొనుటకు హిందూస్త్రీ అసమానమైన సహన సంపత్తిని పొందియే యున్నది. కాని విశేష పరిస్థితులు పొడమి భావి దాంపత్య జీవితము అయోమయముగా గోచరించినప్పుడు తన వైవాహిక ధర్మమునుమీరి దాంపత్యవిచ్ఛేదము గావించుకొనుట అనువగు మార్గమగునా కాదా యను సమస్య విమర్శకులను కలవరపరచుచున్నది. కాని యీ వివాహవిచ్ఛేదన పద్ధతి ఎంతవరకు స్త్రీ పురుషుల జీవితముల సౌఖ్యవంతములుగా జేయగల దనియే సంశయము

జీవితరంగమున అన్ని విభాగములందును స్త్రీ, ఆర్య సంప్రదాయమున కీవరకు వన్నె పెట్టిన గౌరవస్థాన మలంకరించుట కుద్యుక్తురాలగుచున్నది. సంఘ కల్యాణము ఈ స్త్రీ పురుషులిరువురి విజ్ఞాన సంపత్తిపైననే ఆధారపడియుండుట గ్రహించి, దేశహితము కొఱకు, జాతీయ సముజ్జీవనముకొఱకు, పరరాజ్య దాస్యబంధమునుండి విమోచనమునకు, పురుషులతోబాటు స్త్రీలును సమానముగ ప్రజోపయోగసేవా కార్యములందును పౌర జీవనమందును పాల్గొని, అవసరమైన త్యాగములనుచేసి కష్టనష్టములకు పాల్పడుటయందును ఆనందమును బడయగలుగుచున్నారు.

స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యము కావలెనని, సదా పురుషునిపై ఆధారపడవలసిన పరాధీనబుద్ధి పోవలెనని, ఆత్మవిశ్వాసము స్వయంపోషకత్వము వృద్ధి కావలెనను కృషి అధికమగుచున్నది.

పాశ్చాత్య అనుకరణము, నాగరికతా వ్యామోహము, వస్తుమయ ప్రపంచ సంపదయందే అత్యంతాభిలాష, సుఖభోగ లాలసత్వము - ఇవియు ఒకవంక హద్దుమీరి

వృద్ధియగుచున్నవి. కాని స్త్రీ పురుష జాతి విద్వేషములకుగాని, కామ వికారములకుగాని తావులేని మన ప్రాచీన ప్రాచ్యసాంప్రదాయాన్ని పునర్జీవింప చెయ్యడమే భారతస్త్రీ లక్ష్యం గావున తాత్కాలిక జనిత వ్యామోహామునకు అంత తేలికగా లొంగిపోదు. స్త్రీ జాత్యభ్యున్నతి కనువగు మార్గములను స్త్రీలలవరచుకొందురనుటకు సందియములేదు.

మన భారతదేశమున, ఒకప్పుడు ఆర్యసభ్యత అత్యుత్తమ శిఖరమును అందుకొనియుండిన పుణ్యభూమియందు, ప్రాచ్యవిజ్ఞాన సంపదను వారసత్వముగ అందుకొన్న యీ మాతృదేశమున, మైత్రేయి-గార్గి వంటి ఋషిసంతతికి చెందిన విదుషీమణులు వెలసిన యీ వేదభూమియందు, యీ నవయుగమున, ప్రాక్ ప్రతీచీ సమ్మేళనమున, "క్రొత్త పాతల మేలుకలయిక క్రొమ్మెఱుంగులు జిమ్మ" వలసిన సమయమున, వ్యక్తిగత జీవనమునందుగాని, కుటుంబమందుగాని, సంఘమందుగాని, పౌరజీవనమందుగాని జాతీయ జీవనమందుగాని, సార్వజనీన సమగ్ర పరిణతాభివృద్ధికొఱకైన నిర్మాణశీల కార్యకలాపములందు, నేటిస్త్రీలు తమవంతును యథోచితముగను అర్థవంతముగను నిర్వర్తించకపోదురా !

భారతీయాత్మకు వినష్టము కాజాలనితీరున, యావత్తు జగత్తుకు వెలుగుచూపగల - సందేశమీయగల, సంస్కృతిగల, భక్తిజ్ఞాన కర్మ వైరాగ్యములతోడి ఆధ్యాత్మిక మహిత సంపత్తిగల, మన ఆర్యసభ్యతకు కొఱతరాని విధమున, నారీగౌరవము, మాతృపూజ జరుగవలెననియే నేటి మన మహదాశయము.

---

## వింత - సమస్య! మీకు ఏ బిడ్డ కావాలి?

ఒక ప్రసూతి వైద్యాలయములోని జెనరల్‌వార్డులో ఇంకా అనేకమంది యితర స్త్రీలుకూడాగల చోట నీ వొక బిడ్డను కన్నావనుకో. నీ వాబిడ్డను పెంచి పెద్ద చేశావు. నీవు ఆ బిడ్డను అమితంగా ప్రేమించావు. బిడ్డకు ఆరేళ్లు నిండినవి. అంతట, ఈ బిడ్డ నీకు పుట్టినది కాదని పూర్తియైనసాక్ష్యంతో ఋజువయినదనుకో. నీ బిడ్డ పుట్టిన సమయముననే పుట్టిన యింకొకరి బిడ్డయు నీ బిడ్డయు "మారుగిల్లు" అయిపోయినారని నీకు తెలియవచ్చినదనుకో. అప్పుడు నీ మనస్సు ఎలాగుంటుంది? నీ వేమనుకుంటావు? నీ అసలు బిడ్డను తనవద్దగల యింకొకమాత నీ సలహాప్రకారం చేయడానికి యిష్టపడుతుందనుకో—? నీ బిడ్డయే అనుకొని పెంచినబిడ్డనే ఉంచుకుంటావా, నీ అసలుబిడ్డ కోసం అడుగుతావా? ఏదో ఒక్కబిడ్డను మాత్రమే నీవు ఉంచుకోవచ్చును.

త్వరలోనే మీరు సహేతుకమైన కారణాలతో మీ జబాబులు పంప ప్రార్థన.

# మనసులో మాటలు

## 1937-వ సంవత్సరపు హిందూ స్త్రీల వారసత్వపు చట్టం

● శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ ●

హిందూ స్త్రీలకు ఉపయోగకరమైన యే బిల్లువచ్చినా శాసనసభలలో నెగ్గడమే కష్టం. ప్రతి బిల్లుకు భిన్నాభిప్రాయాలు వెల్లడించే సభ్యులంతా స్త్రీల బిల్లనగానే యించుమించుగా యేకమౌతారు. యిక అది ఆస్తిహక్కులకు సంబంధించినది అయెనా ఏకగ్రీవాభిప్రాయమే, అంత కట్టుగా యెదిరిస్తారు. తరతరాలనుంచీ స్త్రీల హక్కులను అణగద్రొక్కి వారి ఆస్తిపాస్తులను అనుభవించడానికి అలవాటుపడ్డ వారికి, స్త్రీకిగూడా తమతోబాటు సమానవాటా యివ్వడమంటే యిష్టముంటుందా మరి?

1937-వ సంవత్సరంలో చేయబడిన హిందూ స్త్రీల వారసత్వచట్టం ఎట్లాగో అవాంతరాలన్నీ గడిచి బయటపడి విగతభర్తృకలైన స్త్రీలకు కొమాళ్ళతోబాటు భాగం కల్పించింది. ఈ చట్టంవల్ల స్త్రీ భర్త చనిపోతే కొమాళ్లతోబాటు తానూ ఒకభాగం పంచుకోవచ్చు. తన యిష్టానుసారం అనుభవించవచ్చు. కొడుకులు చందాలు వేసుకొని మనువృత్తి యివ్వనక్కరలేదు. ఏకపుత్రుడే అయినా అతనితోగూడా స్త్రీ తనభాగం పంచుకోవచ్చును. ఈ శాసనం చేయబడటం నిజంగా స్త్రీల అదృష్టమనే చెప్పాలి. ఇట్టిచట్టం చేయ్యడానికి శాసనసభ్యులు యెంతో ఔదార్యంచూపించారని ఒప్పుకొనితీరాలి. కాని దేవుడు వరమిచ్చినా పూజారి వరమియ్యలేదన్నట్టుగా భారతశాసనసభవారు దీనిని అంగీకరించినా, రాజప్రతినిధి దీనిని ఆమోదించినా, దీనికి అవాంతరం రానేవచ్చింది. 1935 సం॥ ఇండియాచట్టంవల్ల కేంద్ర ప్రభుత్వానికి జెందిన కొన్ని అధికారాలు రాష్ట్రీయప్రభుత్వాల వశం చేయబడ్డవి. వానిలో వ్యవసాయభూముల హక్కు ఒకటి ఈవిధంగా సెంట్రలు ప్రభుత్వంనుండి రాష్ట్రీయ ప్రభుత్వానికి వచ్చింది. ఈ సంధిగ్ధసమయంలో చేయబడిన 1937-వ సం॥ హిందూ స్త్రీల వారసత్వపు చట్టంలోని ఆస్తిహక్కులు పరిశీలించే సమయంలో వ్యవసాయ భూములు రాష్ట్ర ప్రభుత్వాలకు సంబంధించినవి గదా, వీనిపై హక్కును కేంద్రప్రభుత్వం ఎట్లా చలాయిస్తుంది? పై వారసత్వ చట్టంవల్ల వ్యవసాయ భూములపై గూడా స్త్రీకి హక్కు గల్పించడానికి కేంద్ర ప్రభుత్వానికేమి అధికారం ఉన్నది? అనే ధర్మసందేహం వచ్చింది. ఈ సందేహం తీర్చడానికి భారత దేశ ప్రధాన న్యాయస్థానమైన ఫెడరలుకోర్టుకు పోయింది వివాదం. వారు సావకాశంగా విచారించి 1937-వ సంవత్సరంలో చేయబడిన హిందూ స్త్రీల వారసత్వపు చట్టము న్యాయసమ్మతమైనదే అయినప్పటికీ రాష్ట్రపు ప్రభుత్వాలకు వశము చేయబడిన వ్యవసాయపు భూములకు వర్తింపజేయడానికి వీలులేదు కనుక వ్యవసాయపు భూములు మినహా తక్కిన ఆస్తిలోనే స్త్రీలు కొమాళ్ళతోబాటు భాగార్హులౌతారని తీర్పు చెప్పారు. న్యాయశాస్త్రరీత్యా ఈ తీర్పు న్యాయమైనదే కావచ్చునుగాని స్త్రీలకుమాత్రం ఈ తీర్పువల్ల చాలా అన్యాయం జరిగింది. ఈ హిందూదేశంలో ముఖ్యమైన ఆస్తి అంటే వ్యవసాయపు భూమే. ఆ భూమికే ఈచట్టం వర్తించకపోతే ఈ చట్టంవల్ల స్త్రీకి గల్గే ప్రయోజనం లేదు. ఈచేత యిచ్చి ఆచేత తీసుకున్నట్టయింది. మామిడిపండులో గుజ్జు మినహా సర్వం అంటే పైతొక్క లోపలిటెంక దానంచేసినట్లయింది.

స్త్రీ లెల్లరు యీ అన్యాయం బాగా గమనించి గొప్ప ఆందోళనచేస్తేనే తప్ప ప్రభుత్వమువారి దృష్టికి యీ విషయం వచ్చి గవర్నరు జనరల్ యే ప్రత్యేకాధికారాలచేతనో ఈ లోపం సవరించడమో,

లేక రాష్ట్రీయ గవర్నమెంటులు ఈ శాసనం వ్యవసాయభూములకు వర్తించునట్లుగా చేయడమో ఏదో ఒకటి జరగదు. అఖిలభారత మహిళాసంఘము యీ విషయమై గట్టి ఆందోళనము చేస్తుందని నమ్మవచ్చును.

## రైళ్లలో స్త్రీల సౌకర్యాలు

స్త్రీలకు ప్రత్యేకంగా ఒక్క రైలుపెట్టె వేయడంతో స్త్రీలకు సమస్త సౌకర్యాలూ సమకూర్చినట్లుగా రైల్వే కంపెనీవారు భావిస్తూ ఉంటారు. కాని రైళ్లలో ప్రయాణంచేసే సమయంలో స్త్రీలు పడుతున్న యిబ్బందులెన్నో ఉన్నాయి. వానిలో స్త్రీల సమ్మర్దం యెంత యెక్కువగానున్నా ఒక్కటే రైలుపెట్టెమాత్రమే వేయడం మొదటి యిబ్బంది. ఇందువల్ల స్త్రీల పెట్టెలో ఒక్కొక్కప్పుడు గర్దీ ఒత్తిడివల్ల ప్రాణాలు పోతాయనిపిస్తూ ఉంటుంది. పసిబిడ్డలు గోల్లున గోలపెట్టుతుంటారు. ఎడపిల్లలంతకంటే గుండెలు పగిలేట్టు ఏడుస్తుంటారు. వీళ్లిద్దరినీ సమాధానపెట్టలేక తల్లికిగూడా దుఃఖం కంఠగతమౌతూ ఉంటుంది. రెండోది స్త్రీలపెట్టె యెక్కడనో అన్నిబండ్లకూ చివరను గార్డుపెట్టెకు ప్రక్కను వేయడం, స్త్రీల పెట్టె చివరగా ఉండటంవల్ల అది సాధారణంగా ప్లాటుఫారం దాటిఉండడం సంభవిస్తూ ఉంటుంది. అందువల్ల స్త్రీలు పసిబిడ్డలతో అంత యెత్తునుంచీ దిగడమూ, సామానులు వగైరాలు దించుకోడమూ ఎంతో కష్టమౌతూ ఉంటుంది. అంతేగాకుండా రైళ్లవద్ద అమ్మబడే చిరుతిండి పదార్థాలు మంచినీళ్లూ కాఫీ వగైరాలుగూడా చివరబండ్లదాకా రావు. సాధారణంగా అవి కావాలె, యివి కావాలె, అని మారాములు చేసే పిల్లలు తల్లులవద్దనే ఉంటారు. వాళ్ళ పెట్టెలవద్దకే పైవస్తువులు రాకపోవడం చాలా అసౌకర్యం అనడానికి సందేహంలేదు. ఈ రైలుపెట్టె ఆఖరున ఉండటంవల్ల రైల్వే కూలీలుగూడా దగ్గిరదగ్గిర పెట్టెలను చూచుకుంటూ చివరకుగాని స్త్రీల పెట్టెవద్దకు రారు. ఈలోగా రైలు కదలడమో స్త్రీలు కాళ్లు దిగతొక్కుకుంటూ పిల్లలను గీగా అని యేడ్పించుకుంటూ సామానుదించుకోడమో తటస్థిస్తూ ఉంటుంది. పగటివేళనే స్త్రీలపెట్టె దూరంగా ఉండటంవల్ల యిన్ని యిబ్బందులున్నవి. ఇక రాత్రివేళనే అయితే యిందువల్ల స్త్రీలకు గలిగే కష్టమూ అపాయమూ గూడా చెప్పడానికి సాధ్యంకాదు. ఒకొక్కప్పుడు జనం విస్తారంగా లేని సమయంలో రాత్రివేళ చివరదాకా రాలేక జనులు సమీపంలో ఉండే పెట్టెలోనె యెక్కుతూ ఉండటమూ సంభవిస్తూ ఉంటుంది. అందువల్ల స్త్రీల పెట్టెకు ముందునఉండే మూడునాల్గు పెట్టెలు ఖాళీగానే ఉండటమూ, స్త్రీలపెట్టెలో ఒకరోయిద్దరో స్త్రీలు బిక్కుబిక్కుమంటూ ఉండటము, గార్డు ఒక్కడు మాత్రమే ఆపెట్టెకు రక్షకుడుగానో ఒకొక్కప్పుడు భక్షకుడుగానో అవుతూ ఉండటమూ సంభవిస్తూ ఉంటుంది. ఈ సందర్భాన స్త్రీలకు గలుగుతున్న అపాయములెన్నో మనము వింటూనే ఉన్నాము. కనుక ప్రత్యేక పెట్టెలో స్త్రీలకు గల్గుచున్న యీ యిబ్బందులన్నీ తొలగవలెనంటే స్త్రీలపెట్టె రైలుకుమధ్యగా ఒకే నిర్ణీత ప్రదేశంలో తగిలించడం చాలా అవసరం. అంతేగాకుండా స్త్రీజనం అధికంగా ఉన్నప్పుడు రెండోపెట్టెగూడా వేయడం ముఖ్యం. స్త్రీల పెట్టెలో సౌకర్యాలు యెక్కువగా ఉన్నట్లయితే స్త్రీలందరూ స్త్రీల పెట్టెలోనే కూర్చోడానికి అభిలషిస్తారు.

అంతేగాకుండా రైలుపెట్టెలన్నిటికీ పెద్దవిగా ఉన్నవానికి ఒక్కొక్కప్రక్కను రెండుదార్లు సాధారణంగా ఉంటున్నవి. అవి రెండూ ఎక్కడానికి దిగడానికి ఉపయోగించకుండా ఒకటి ఎక్కేదారిగాను ఒకటి దిగేదారిగాను నిర్ణయింపబడి ఉన్నట్లైతే రైలు బండ్లలో ప్రతి పెట్టెవద్దా ఎక్కేదిగే ప్రయాణీకులకు గలిగే త్రోపిడీ, సంఘర్షణా, జగడమూ, ఆలస్యము, సామానుల దెబ్బలు, అన్నీ తప్పిపోతాయి. మూడు నిముషాలు ఆగవలసిన బండి రెండు నిముషాలు మాత్రమే ఆగి పోవచ్చు. ఆంధ్రదేశరైలు ప్రయాణీక సంఘం వారు యీ విషయాలు ఆలోచిస్తే బాగా ఉంటుంది.

# పితృస్మృతి

సీ. అవనీభరక్షమ నాదిశేషునిబోలి
వాక్పటుత్వమున సర్పపతిఁ బోలి
గుణమణిగణముచే ఫణివల్లభుని బోలి
యీశ్వర భక్తి నహీనుబోలి
బహుముఖైశ్వర్యతఁ బాపఱేనింబోలి
హరిభజించుటయం దనంతుఁ బోలి
యాయురారోగ్య విద్యల వ్యాళవరుఁబోలి
నామసామ్యమునఁ బన్నగముఁ బోలి

గీ. వెలయు శ్రీ భుజంగ క్షమావిభుని జనకు
నాత్మజావత్సలుని విభవాతిశయుని
శాంతమతి సజ్జనప్రియు సత్కవీంద్రు
నాత్మశాంతికిఁ బరమేశు నభినుతింతు.

ఏలూరు
8-5-41

ఇట్లు భుజంగరాయ పుత్రిక,
వాడ్రేవు శ్రీ రంగనాయకమ్మ.

# శ్రీ భుజంగరాయస్మృతి

ఉ. నిండుమనంబుఁ దాల్చిన వినీతుఁ డుదారగుణుండు చిత్కళా
పండితుఁ డాంధ్ర మందుఁ గవివర్యులలోఁ దలలోని నాల్కఁగా
నుండిన ధీరుఁ డీజగమునుండి దివంబున కేగె నిప్డు భూ
మండల మేలు శ్రీ భుజగమాన్యుఁడు చిన్నమరాజ్ఞిఁ జేరఁగన్.

చ. కలమును గేలఁ బూని బుధకాండము సత్కవికాండ మెంతయున్
జిలిబిలి ముద్దు పల్కులను జిల్కుచుఁ దిక్కన వోలె వ్రాయఁగా
నలిపెడు రాజటంచుఁ గడు సంస్తుతిఁ జేసెడు రీతిఁ జెప్పఁగాఁ
గలిగిన కైతలల్లు కవికాంతుఁడనంగ భుజంగ రాయఁడే.

చ. పులులను మేకలన్ గలిపి పొందుగ నొక్కట నీరుఁ ద్రావఁగా
నలిపెడు ధీరశాలి యన చక్కని కీర్తిఁ గాంచె నెవ్వరే
నలిగిన నల్గనట్టి సుగుణాఢ్యుఁడు నేఁడు దివంబుఁ జేరఁగాఁ
గలిగె నటన్న లోప మెటుకల్గగయుండుఁ దెనుంగుభూమికిన్.

గీ. రాజుఁ గవిరాజు నొక్కఁడై గ్రాలువార
లాంధ్ర జగతిలోఁ దక్కువ; యందుఁ బెక్కు
గ్రంథములు వ్రాసి ఖండాంతరములయందుఁ
బేరుఁ గాంచిన కవిరాజ ధీరుఁ డితఁడె.

గీ. ఆత్మ శక్తినిఁ గాంచు పుణ్యాత్ముఁ డగుట
నాడుఁ జాటిన రీతిఁ జిన్నమ్మ సతినిఁ
గలసి పార్వతీ పరమేశు కళల తోడ
స్వర్గ సామ్రాజ్య సౌఖ్యంబుఁ బడయుఁ గాత.

శ్రీ వా. రామసుబ్బారాయుఁడు.

# ★ స్త్రీ సాముద్రిక శాస్త్రము ★

కవికలహంసి, శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి

( గతసంచిక తరువాయి )



మిక్కిలి పొట్టిగోరు అనగా పాతికఅంగుళముకంటె తక్కువ నిడివిగలదిగను వ్రేలి చివర పూర్తిగ మూసికొనునట్లు బాగా వెడల్పుగలదిగ నుండి, వ్రేలికొనను తట్టగాను వాడిగలదిగను కనబడునట్లు చేయు గోరు మిక్కిలి వాడియైన సూక్ష్మబుద్ధిని గుర్తించును.

నిడుపుగల వంగినగోరు క్రూరగుణమును, మృగ స్వభావమును సూచించును.

కొంచము నలుపురంగుగల గోరు వంచన, తంత్రము, కుయుక్తి వీటిని సూచించును.

నాల్గువైపుల వంకరగలగోరు క్షయరోగమును, పాండు రోగమును తెలుపును.

నిడివిగలిగియు, వంగియు, కొనయందు వెడల్పుగలిగి అడుగున కుఱుచగను, నీలిరంగు గలదిగను నుండు గోరు అంగ వికృతి రోగమును, బలహీనస్థితిని గుర్తించును.

మిక్కిలి కుఱుచై, వంపుగలిగి మాంసమునందు పూడియుండు గోరు మృదువైన సన్నని దేహమును సూచించును.

అడుగున చంద్రరేఖబోలి వంపులేని కుఱుచనగు పలకవంటి గోరు హృదయనాడి బలములేక నున్నితముగ నుండుటను సూచించును.

పొట్టియై తట్టవలె త్రికోణాకృతిగా నుండుగోరు పార్శ్వ వాతము గల్గుననుటను సూచించును.

అడుగుప్రక్క బాగుగానాటి వెడల్పును, నిడివియు లేనిగోరు నరముల సంబంధమైన వ్యాధిని, హృదయ వ్యాధిని, వణుకు వ్యాధిని సూచించును.

తెల్లనిచుక్కలుగల గోరు నరముల బలహీనతను, గుండెదడను దెలుపును.

పసుపువన్నెగల గోరు యజీర్ణరోగమును, పిత్త జ్వరమును, పిత్త పాండువ మొదలగు వ్యాధులను సూచించును.

మిక్కిలి ఎఱ్ఱని గోరు శరీరమున రక్తము అధికముగా నుండుటను దెలుపును.

గోలివలె గుండ్రమై కొనయందు వంపుగల గోరు, వెన్నెముకయందు గాని, ప్రేవులందుగాని గడ్డను సూచించును. ఇది అపాయకరమైన స్థితియని ఎఱుంగవలయును.

కుక్కగోళ్లవలె వంపుగలిగిన గోరు శ్వాసనాళపు వ్యాధిని, కంఠమునకు సంబంధించిన వ్యాధులను దెల్పును.

అడ్డగీతలుగల గోరు నరములు చెడి అపాయకరమైన వ్యాధులలో నుండుటను సూచించును.

# ★ రాజమకుటం

రచయిత :

శ్రీ గోవిందవల్లభపంతు

అనువాదకర్త :

శ్రీ పురాణం కుమారరాఘవశాస్త్రి

## ముందు కథ

పన్నా కమల్ మీరు దర్బారుకువెళ్లి, సంగతంతా కమల్ మీరు ప్రభువుకు తెలియ జెప్పుకుని ఉదయునికి రాచనగరులో ఆశ్రయం కోరింది. ఆశాశాహుడు తన తల్లిమాటమీద ఉదయునికి ఆశ్రయమిచ్చి ఈ రహస్యమంతా గుప్తంగా ఉంచుతానని ప్రమాణ పూర్వకంగా ఒప్పుకుంటాడు. ఛందావత్ సర్దారు వల్ల వనవీరునికీ రహస్యం తెలిసిపోతుంది. శీతలసేని కమల్ మీరు వెళ్లడానికి సిద్ధమౌతుంది.

### పాత్రలు

1. బహుదూర్ సింగ్ ... పన్నా భర్త
2. ఉదయసింహుడు ... విక్రముని తమ్ముడు
3. భిక్షుకుడు ...
4. పన్నా ... ఉదయుని దాది
5. జయసింహుడు ... ప్రధానమంత్రి పుత్రుడు
6. ఛందావత్ ... ఒక సర్దారు
7. ఆశాశాహుడు ... కమల్ మీర్ప్రభువు.

ఇక చదవండి

## తృతీయాంకము

### దృశ్యము 3.

[కమల్ మీరు రాజమార్గము. తెరలో భిక్షుకుడు పాడుతూంటాడు.]

భైరవి - త్రితాళం.

ఆప్తులనువారిలను లేరండీ!

౧

సుఖవైభవమొక ఛాయ సుమండీ,
ఆశలు మృగతృష్ణలు నమ్మండీ,
లోభమోహములలో బడకండీ,
జగజీవన మిది కలయేనండీ!

[ఉదయుడు, బహుదూర్ సింగ్ ప్రవేశిస్తారు]

బహుదూర్ :- నా కిదేమీ బాగులేదు ఉదయ్! నువ్వేమో ప్రతిరోజూ పట్టుదలపట్టి నదియొడ్డుకు షికారు వస్తున్నావు. ఇక్కడి ప్రజలందరికీ నువ్వు ఆశాశాహుని మేనల్లుడివిమాత్రం కాదని బాగా తెలిసిపోయింది. నీ వెరగవూ?

ఉదయ : అయితే ఏం భయం? సంగ్రామసింహ మహారాణా పుత్రుణ్ణనికూడా వాళ్ళను తెలుసుకో నీయండి. ఏం పెద్దనాన్నగారూ!

బహదూర్ ;-[ఉదయునినోటికి చెయి అడ్డంపెట్టి] ఊరుకో, ఊరుకో, ఏమంటున్నావూ? ఈమాట గనక వనవీరుని చెవులదాకా ప్రాకిపోయిందంటే మనకు క్షేమంకాదు.

ఉదయు :-వనవీర్! ఆ హంతకుడికి నేనేమీ భయపడను. ఇప్పుడు నేను సంపూర్ణ బలశాలినైనాను. ఇన్నేండ్లనుంచీ మీవద్ద రణకౌశలము నేర్చుకుంటున్నాను కాదూ! నేనేమన్నా బండశిష్యుణ్ణా మీకు?

బహదూర్ :-కాకపోయినా మనము కొంచెం భయపడవలసే ఉంది. వనవీర్‌వంటి హింసాత్మకుణ్ణి నే నెక్కడా చూడలేదు; అతడంటే నాకెంతో భయం. అదికాక, ఉదయ్! నీవు నిన్ను నీ అసలు రూపలో ప్రకటం చేసుకోవాలని ఎందుకంత ఆతృత పడతావు? స్వయంగానే తెలిసిపోతోందిగా అందరికీ! ఆనాడు నీవు-కమల్‌మీర్ దర్బారు తరపున శోణిగురు సర్దారుకు స్వాగతం ఇచ్చినప్పుడు, ఆయన నీ ధీరలక్షణాలకు చకితుడై అన్నాడు-కాదూ: "ఇతడు ఆశాశాహుని మేనల్లుడుమాత్రం ఎప్పటికీ అయివుండడు" అని.

ఉదయు :-ఔను. ఆ తర్వాత మీకు తెలియదేమో: ఆయన తన అనుమానాన్ని ఆశాశాహుకు తెలియ జేశాడు. ఆశాశాహ్ ఏమీ దాచకుండా నా నిజసమాచారమంతా ఆయన కెరుకపరచాడు. అప్పుడు శోణిగురు సర్దారు నన్ను కౌగలించుకుని "నాయనా! నీ పూర్వజాల సింహాసనం తిరిగి స్వాధీనం చేసుకోవాలని నీకు అభిలాష కలిగినప్పుడు నన్నుకూడా జ్ఞాపకంతెచ్చుకో. బప్పారావు—వంశ—గౌరవ—ఉద్ధారణకు నేనుకూడా మహదానందంతో సహాయంచేస్తాను" అన్నాడు.

బహదూర్ :-సహాయం విషయంలో నీకేమీ లోటుండదు. బప్పారావు పవిత్రనామమే మంత్రమువలె పని చేస్తుంది. ఏనాడు నీ నిజరూపం అందరికీ ప్రకటమాతుందో ఆరోజు చూడాలి.

ఉదయు :-ఎందుకు దబ్బున ప్రకటం కానీరు మీరు? నే నీవిధంగా దాగి ఉండలేదు. ఈ పంజరం తలుపులు తెరచివేయండి; ఆ విశాలాకాశంలో స్వేచ్ఛగా సంచారంచేయాలనిపిస్తోంది.

బహదూర్ :-[పాడుతూ వస్తోన్న బిచ్చగాణ్ణిచూచి] ఊరుకో, ఊరుకో, ఎవరో వస్తున్నారు.

[ఒకముసలి-గుడ్డి-బిచ్చగాడు పాడుతూ ప్రవేశిస్తాడు]

౧

బిచ్చగాడు :—

కంటకచయమే మార్గమునిండా,
దుఃఖ-క్లేశములె లోకమునిండా,
విరహ-వియోగ-విషాదమె అంతా,
ఆశాకల్పనలే బ్రతుకండీ!

రక్షించండి బాబా! రక్షించండి! మూడురోజులనుంచీ తిండిలేదు. ఒక్కకబళం! అయ్యో భగవంతుడా! [ఇలా అంటూ కర్రసాయంతో నిష్క్రమిస్తాడు]

బహుదూర్ :-ఓపికపట్టు నాయనా! ఆరోజు దానంతటదే చేరువకు వస్తుంది. [పొడుంకోసం జేబులో చెయి పెట్టి, డబ్బీ కనపడక] కాని, అసలు విషయం మరచిపోయాంసుమా! నేను పొడుండబ్బీ నదియొడ్డునే విడిచిపెట్టి వచ్చేశానూ!

ఉదయ :-పెదనాన్నగారూ! మీ కెప్పుడూ ఇదేమాట. మీ అలవాటు పొరపాట్లతో నిండిఉంది. ఈ మరచిపోయే స్వభావమన్నా మానుకోండి, లేదా పొడుంపీల్చే అభ్యాసమైనాను.

బహుదూర్ :-ఆ రెండింటిలో దేన్నీ మానుకోటానికి వీల్లేదిప్పుడు. నేనైనా వాటిని బ్రతికియుండగా విడిచిపెట్ట దలచుకోలేదు. అవి నా యునికి కెంతో ఆవశ్యకం. నీ విక్కడే ఉండు కాస్సేపు. పొడుం డబ్బీ వెదకి తీసుకొస్తాను. [బహుదూర్ సింగు నిష్క్రమిస్తాడు]

[బిచ్చగాడు పాడుతూ ప్రవేశిస్తాడు]

3

శ్యామసుందరుడు, యశోదపుత్రుడు,
వ్రజమోహనుడే పాలకుడండీ!
ఆ మహామహుని దివ్యనామమే
జపించండీ, వెలుగు చూడండీ!

బిచ్చగాడు :-దాతలుమీరు, రక్షించండి, రక్షించండి!

ఉదయ :-ఎవరబ్బీ నువ్వు? ఎప్పుడూ జ్ఞానోపదేశంచేస్తూ ఉంటావు. ఇక్కడ రాజమహలు సమీపంలో నిన్ను చాలసార్లు చూచాను.

బిచ్చగాడు :-చూచియుంటావు బాబా! నాకు చూపు చాలతక్కువ. నా కన్నుల్లోని వెలుగును ముసలితనం హరించేసింది.

ఉదయ :-నీ పేరు?

బిచ్చగాడు :-వ్యవహారంలో ఉపయోగానికి రాకపోవటంచేత జ్ఞాపకంలేదు.

ఉదయ :-నీ యిల్లు?

బిచ్చగాడు :-బిచ్చగాడికి ఇల్లా?

ఉదయుడు :-ఇక్కడ ఎక్కడుంటున్నావు మరి?

బిచ్చగాడు :-దేవాలయందగ్గర బావి ఉందే, దానికి కొంచెం దూరంలోవున్న రావిచెట్టుకింద. వెయ్యి కాలాలపాటు బ్రతుకుతావు బాబా! నేను మొన్నటినుంచీ అన్నం మెతుకు చూడలేదు.

ఉదయ :-పాపం!

బిచ్చగాడు :-భగవంతుడు నిన్ను చల్లనిచూపు చూస్తాడులే నాయనా!

[నాలుగుడబ్బు లిద్దామని ఉదయుడు లోపలిజేబులోకి చెయిపోనిచ్చినప్పుడు బిచ్చగాడు దాచి తెచ్చిన కటారు వెలికితీసి, ఉదయుని పొడువబోతాడు. హఠాత్తుగా బహదూర్ సింగు వచ్చి, బిచ్చగాడి చెయి పట్టుకుంటాడు. బిచ్చగాడు కటారు విసరివేసి, చెయి విదళించుకుని పరుగెత్తబోతాడు. బహదూర్ సింగు వాడి చెయివిడిచి, గడ్డంపుచ్చుకుని నిరోధింపజూస్తాడు; అది అతికించుకున్నగడ్డం కావడంచేత చేతిలోకి వచ్చేస్తుంది. బిచ్చగాడు పరుగుపెడతాడు. బహదూర్ సింగు కొంతదూరం వాణ్ణి అనుసరించి విఫల ప్రయత్నుడై తిరిగివస్తాడు. ఉదయుడు నేలమీది కటారు తీసుకుంటాడు]

బహదూర్ :-[తిరిగివచ్చి] పరుగెత్తి గుంపులో కలిసిపోయాడు. చూచావా ఉదయ్! బాగా తెలిసివచ్చిందా?

ఉదయు :-[కటారు చూపిస్తూ] తెలిసింది. మీరు మళ్ళీ నన్ను మృత్యువునుండి తప్పించారు. కాని, ఆశ్చర్యంగా ఉంది. మీరు సరిగ్గా సమాయానికి వచ్చారే!

బహదూర్ :-ఈ బిచ్చగాణ్ణి నేను చాలరోజులనుంచీ చూస్తున్నాను. వీడు నన్నూ, విశేషించి నిన్నూ, ఒక కంట ఎప్పుడూ కనిపెడుతూనే ఉన్నాడు. ఒకనాడు కన్నులు పత్తికాయలవలె విప్పి నీకేసి చూస్తూంటే నా కంటబడ్డాడు. అప్పటినుంచీ వాడంటే నాకు అనుమానంగానే ఉంది; ఎందుకంటే తాను గుడ్డివాణ్ణని చెప్పుకుంటున్నాడు. ఇప్పుడు నేను నదియొద్దకు వెళ్ళి తిరిగి వస్తూన్నప్పుడు వాడు నీ ముందు నిటారుగా నిలబడి యున్నాడు. అంధత్వంవలెనే ముసలితనంకూడా అబద్ధమేనని గ్రహించాను. గబ గబ పరుగెత్తుకుంటూ వచ్చాను. వస్తూ వస్తూండగానే వాడు నీమీద కటారు విసరబోతున్నాడు. పరమేశ్వరుడిదయవల్ల విఫలుడైనాడు.

ఉదయు :-అయితే, ఈ ఘాతుకుడు వనవీర్ పంపించినవాడేనా?

బహదూర్ :-అలాగే తోస్తున్నది. మేము నిన్ను చాలరోజులు దాచియుంచలేక పోయాం. వనవీరుడికంతా తెలిసిపోయింది.

ఉదయు :-ఎవనిబారినుండి నన్ను కాపాడాలని చూస్తున్నారో అతనికే సర్వమూ తెలిసిపోయినప్పుడు ఇంకా ఈ దాగియుండటంవల్ల ప్రయోజనమేమిటి పెదనాన్నగారూ!

[పన్నా ప్రవేశిస్తుంది]

పన్నా :-ఏమీలేదు ఉదయ్! ఇంకా నీవు ఎన్నాళ్ళో దాగియుండవలసిన యవసరంలేదు. మేవాడ్ లోనే కాదు; సమస్త రాజస్థానంలోనూ, సర్దార్లు, సిపాయిలు, సంగరాణా పుత్రునితో ఏకీభవించటానికి సిద్ధంగా ఉన్నారు. కమల్ మీరు ప్రభువు అందరినీ పిలిపించారు. త్వరలోనే వారందరూ రాజదర్బారులో సమావేశమై నీకు సాయపడే విషయంలో ఆలోచనలు చేస్తారు. ఈ సమాచారమంతా ఆయన నాకివాళే చెప్పారు. నీతో చెబుదామని వెతుక్కుంటూ వచ్చాను.

ఉదయు :-నీకు తెలియదేమో, ఇంతకుముందే వనవీరుడు నన్ను వధించేందుకు రెండో ప్రయత్నంచేశాడు. కాని ఈసారి నన్ను వీరు రక్షించారు. ఇక నన్నెవరూ చంపలేరమ్మా!

పన్నా :-[ఉదయుణ్ణి దగ్గరకు తీసుకుని] పరమేశ్వరుడికి ధన్యవాదం. ఇక మేము నీరక్షణ విషయంలో మరింత జాగరూకులమై ఉంటాం. పద, త్వరగా మహలుకు వెళ్ళిపోదాం; వెళ్ళి ఆయనకు కూడా ఈ సమాచారం వినిపిద్దాం.

[పోబోతుంది. కాని తెరలో బైరాగివేషంతో వస్తోన్న జయసింహుని చూచి]

ఎవరు? రావుజయసింహుడుకాదూ! ఈయన బైరాగియై తిరుగుతోన్న సంగతి విన్నాను; కాని వెంటనే గుర్తు పట్టటానికి వీల్లేకుండా ఉన్నాడు.

[జయసింహుడు ప్రవేశిస్తాడు]

జయసింహుడు :-ఎవరు, ఎవరూ? పన్నా! నీవు ఇక్కడ, కమల్ మీర్ లో......

పన్నా :-నీ దగ్గర దాపరికం ఎందుకు? - నేను మేవాడ్ విడిచివచ్చి, ఏడు సంవత్సరాలనుంచీ ఉదయుణ్ణి పోషించుకుంటూ ఇక్కడే ఉంటున్నాను.

జయ :-[ఆశ్చర్యంగా] నాకర్థం కావటంలేదు. ఏ ఉదయుణ్ణి పోషిస్తూ?

పన్నా :-[ఉదయుణ్ణి ముందు. నిలిపి] ఇతన్నే. చూడు, గుర్తించలేవూ? ఉదయుడు కాదూ?

జయసింహుడు :-[మహానందంతో] ఉదయ్! ఉదయ్! ఔను. ఉదయుడే, ఇది స్వప్నం కాదుకదా పన్నా! నీవు ఉదయుని బ్రతికించటానికి అమృతం ఎక్కడినుంచి తెచ్చావు?

పన్నా :-ఇంటికి చేరుకున్న తరువాత అంతా చెబుతాను.

జయ :-నువు ధన్యవమ్మా! నేను శూన్యమతినై, ఏ యాశయమూ లేక, ఈ ప్రపంచంలో భ్రిమ్మరుతున్నాను. నీవు నీ కర్తవ్యాన్ని పాలించి, నాకుకూడా మార్గము చూపెడుతున్నావు. బప్పారావు వంశ వృక్షాన్ని నిలువబెట్టావు. ఇవాళ నా హృదయంలో ఆనందం పొర్లువారుతోంది. [బహదూరుసింగు వేపు చూపుతూ] వీరిని ఎక్కడో చూచినట్టున్నది?

పన్నా :-వీరు నా......, కొన్నియుగాలు అదృశ్యులై పోయారే......

జయ :-ఓహో, బహదూర్ సింహాజీ! జ్ఞాపకం వచ్చింది. వీరు మా నాన్నగారి మిత్రులు. ఆజ్ఞాపించు, అమ్మా! ఘాతుకుడు సింహాసనంమీద ఉండరాదు. ఇతడూ సంగరాణా పుత్రుడు. (ఉదయుని తల నిమురుతాడు) ఈ భిక్షాపాత్ర నికవిడిచి మేవాడ్ - రక్షణకోసం శస్త్రధారణ చేస్తాను. [భిక్షాపాత్ర, రుద్రాక్షమాల, మొదలైనవన్నీ విసరి పారేస్తాడు. ఉదయు డాయనకు తన కత్తి నిస్తాడు]

బహదూర్ :-నువు నా మిత్రుని యోగ్యపుత్రుడివి.

పన్నా :-పద, మహలుకు వెళుదాం; అక్కడే విషయమంతా సవిస్తరంగా చెబుతాను.

జయ:-పదండి, పదండి, ఇంకమన మేవాడ్. దేశమాత రాక్షసుని పంజానుండి విముక్తి పొందుతుందనే మహదానందంలో పితృమరణాన్ని కూడా మరచిపోతాను.

[మొదట ఉదయుడు, పన్నా; తరువాత జయసింగు; చివరకు పాడుం పీలుస్తూ బహదూర్ సింగు నిష్క్రమిస్తారు]

[తెరపడుతుంది]

## దృశ్యము ౪.

[కమల్ మీరు దర్బారు. పన్నా, ఉదయుడు, బహదూర్ సింగు, ఛందావత్ మొదలైన సర్దార్లు తమతమ ఆసనాలమీద సుశోభితులై ఉంటారు. సింహాసనంమీద ఆశాశాహుడు విరాజిలుతుంటాడు]

ఆశాశాహ్:-కమల్ మీరు రాజసభ ఇవాళ రాజస్థానములోని ప్రముఖ సర్దార్లతో సుశోభితమయింది. చాల సంతోషం...బప్పారావు-పవిత్ర వంశము పట్ల మీకున్న గౌరవ-శ్రద్ధలు అతీతములు. మీ పూర్వజు లంతా అనేకసార్లు మేవాడ్-శత్రుసంహారంకోసం శస్త్రధారణచేసి, యుద్ధరంగంలో ప్రాణాలర్పించారు. మీ త్యాగబుద్ధి మీ వీర్యమును పవిత్రము చేస్తున్నది...

ప్రస్తుతము ఈ సమావేశముయొక్క ముఖ్యోద్దేశము మేవాడ్‌కు సంబంధించిన ఒక విచిత్ర-సత్యాన్ని ఉద్ఘాటించటమే. అందులో ఈ వీరబాల పన్నా అద్భుత-త్యాగము అంతర్భూతమై ఉంది...అమ్మా! ఇటు వచ్చి, ఈ ఆసనమునుండి మాకు నీ త్యాగ-కథ తార-స్వరంలో వినిపించు. విని మేమూ పునీతుల మౌతాం.

పన్నా:-తప్పకుండా, సర్దార్ మహోదయా! కాని మీ మెప్పుకోసం కాదు; ఉదయుడు తిరిగి తన యధికారాన్ని పొందవలెనని. [ఉదయునితోకూడా వేదిక నధిరోహిస్తుంది]

ఆశా:-[సింహాసనమునుండి లేచి] రా, ఉదయ్! ఈ క్షుద్ర-సింహాసనం అధిష్టించి నీ స్పర్శచేత దీన్ని పవిత్రం చెయ్యి.

[ఉదయుడు సింహాసనంమీద కూచుంటాడు. పన్నా, ఆశాశాహుడు చెరొకవేపున నిల్చుంటారు]

పన్నా! ఆరంభించు.

పన్నా:-రహస్యం చాలవరకు బయటపడినప్పటికీ చాలమంది విశ్వసించటంలేదు. అది సత్యం అని ప్రమాణపూర్వకంగా చెబుతున్నాను. మేవాడ్-సింహాసనానికి నిజమైన అధికారి శిశువే, సంగ్రామసింహ మహారాణా పుత్రుడు ఉదయసింగ్. ఇతన్ని చిన్నతనంలో చూచినవారిప్పుడు గుర్తుపట్టగలరు.

[బైరాగివేషం తీసివేసి జయసింహుడు ప్రవేశిస్తాడు]

జయసింహుడు:-ఔను; నేను చూచాను. ఈ మధ్య ఏడుసంవత్సరాలు అదర్శనుడై ఉన్నప్పటికీ చక్కగా గుర్తుపట్టవచ్చు. ఇతడే సంగరాణా పుత్రుడు, మహారాణా ఉదయసింగ్.

పన్నా:-రక్తపాతము జరిగిన ఆనాటిరాత్రి ఇతన్ని ఒకబుట్టలో దాచి బారీ సహాయంతో కోట యావలకు తీసుకొచ్చాను. ఇతని సెజ్జమీద ఎవర్ని నిద్రపుచ్చానో, అతన్ని వధించి, వనవీరుడు ఉదయుని నామరూపాలు మంటకలసినై అని భావించాడు.

ఒకసర్దారు:-విన్నాం. అతడు నీ కొడుకే. నువు ధన్యురాలి వమ్మా! నీ త్యాగకథచేత చరిత్ర పవిత్రమయింది.

పన్నా:-మీ కింతకన్నా ఎక్కువ విశ్వాసం కలిగించటానికి నేను మరేమీ చెప్పలేను. ఇతడే సంగరాణా పుత్రుడు, అభాగ్యుడు; ఇతని సింహాసనం ఘాతుకు డాక్రమించాడు.

రెండోసర్దారు:-నేను ఇవాళే మేవాడ్‌నుంచి వచ్చాను. ఇక్కడ ఉదయుని రక్షణ, శిక్షణ—అంతా అక్కడే విన్నాను. మేవాడ్-రాజ్య-విశుద్ధ-అధికారికి నా ప్రాణాల్నికూడా బలి యివ్వటానికి సిద్ధంగా ఉన్నాను.

ఛందావత్:-నేను వనవీరునితో పోట్లాడి వచ్చేశాను. అతన్ని సింహాసనంనుంచి దింపటానికి నా కాయశక్తులా మీకు తోడ్పడతాను. ఆయనకిప్పుడు చెడ్డ గర్వం ఎక్కిపోయింది. తన యిచ్చిన పాయసపుదొన్నె స్వీకరించమని బలవంతం చేస్తున్నాడు.

ఆశాశా:-మీరందరూ సాయపడతామంటున్నారు, బాగుంది. ఇక మన భవిష్యత్తును గూర్చి యేమిటాలోచన?

బహదూర్:-ఏముంది? ఇప్పుడే రణభేరీ మోగిద్దాం. 'ఉదయసింహమహారాణాకు జై' అంటూ చిత్తోడు మీదికి దండెత్తుదాం. నాకు ఒక చేయి మిగిలివుంది కదా! దీనితో డాలుకాదు, కత్తే పడతాను.

ఆశాశా:-బహదూర్‌సింగ్! జీవితంలో చాలభాగం యుద్ధక్షేత్రంలో గడపిన అనుభవశాలివై కూడా ఇంత శీఘ్రంగా యుద్ధానికి బయలుదేరుదామని సలహా యివ్వటంలో నీవు ఆలోచించి మాట్లాడుతున్నట్టు కనిపించటం లేదే.

బహదూర్:-నేను ఆలోచించే చెప్పాను. బహుశః మీకు సైన్యము, ఆయుధసామగ్రి స్వల్పముగా ఉన్నదని సంకోచంగా ఉందేమో; అటువంటి చింతేమీ పెట్టుకోకండి. ఉదయుడు బ్రతికియున్నాడని విన గానే మేవాడ్ ప్రజలంతా అతనికి సహాయార్థం కత్తులు పుచ్చుకుని, ఇళ్లువిడిచి పరుగెత్తుకుని వస్తారు. ధర్మంకోసం ప్రతిక్షత్రవాడూ సైనికుడైపోతాడు. అబలలు కూడా శస్త్రధారణ చేస్తారు.

జయసింహుడు:నాకూ అదే విశ్వాసం వుంది. ఇవాళే బయలుదేరటం దుడుకుగా ఉంటుందని తోస్తే రేపు బయలుదేరుదాం. ఆలసించటం మాత్రం ఉచితంకాదు. మనం యుద్ధసన్నద్ధులమై బయలుదేరిన తర్వాత దారిలోనే కావలసినంత సహాయం లభిస్తుంది. నేను సమస్త-రాజస్థానంలో తిరిగి తిరిగి

వనవీరుడి పాపకథ ఇంటింటా వినిపించి వచ్చాను. వారికి నాపట్ల అభిమానం ఉంది. ఉదయుడు జీవించే ఉన్నాడని తెలిస్తే అందరూ మనకు సాయంగా పరుగెత్తుకు వస్తారు.

**ఆశాశా** :-అయితే వనవీరునిపక్షాన ఎవరెవరున్నారో?

**ఛందావత్** :-మేవాడ్‌లోని-ఇంకా ఆ చుట్టుపక్కల ఉండే-సర్దార్లంతా ఇక్కడే సమావేశమై ఉన్నారు. వీరంతా వనవీరుడంటే అసంతుష్టి చెందినవారే. కొందరు సర్దార్లు మనల్ని దారిలోనే కలసి కొంటారు. ఇంకా ఎవరేనా మిగిలివుంటే వారు ఉదాసీనులుగా ఉండిపోతారు. ఇక వనవీరుడికి మిగిలింది ఏమిటి? జీతండబ్బులు తింటోన్న సైన్యం. దానివల్ల ఏమౌతుంది?

**ఆశాశా** :-[ఉదయునివైపు తిరిగి] చిత్తోడుకు మహారాణా మీరు. యుద్ధానికి బయలుదేరే విషయంలో మీ అభిప్రాయం ఏమిటి?

**ఉదయు** :-[సింహాసనంనుంచిలేచి] ఏముంది? యుద్ధమార్గమే నిశ్చయం చేసుకుందాం. ఇవాళే యుద్ధ సామగ్రి, సైన్యం సమకూర్చుకుందాం. రేపు ఉదయమే యుద్ధం.

**ఆశాశా** :-సరే; మాకు మహారాణా ఆజ్ఞ శిరోధార్యం.

**అందరు** :-మేవాడ్ మహారాణాకు జై!

[అందరూ కత్తులెత్తి జయశబ్దం పలుకుతారు]

-తెరపడుతుంది-

---

# ధాన్యలక్ష్మి

తలదువ్వి బంతిపూవులు కొప్పునిండుగా బెట్టి, యుదయసూర్య బింబమువలె
గుండ్రగా నింతటి కుంకుమ బొట్టును ఫాల ప్రదేశాన లీలదాల్చి
కనుల గాటుకబెట్టి గళమున మంచి గంధమలంది పసుపు పాదముల బూసి
కరముల గోట్లును కాళ్లకందెలు కడియాలు భూషణములై యలరుచుండ,

బంగరంతయు పన్నుల పాలుగాగ
గళము మంగళ సూత్రాన గ్రాలుచుండ
వేళ కన్నపు దుత్తను గేలబూని
వచ్చు 'ధాన్యలక్ష్మి' వలె నీభార్య కృషిక!

—వారణాసి వేంకటేశ్వరులు.

# మనలోమాట



● శ్రీమతి గంటి కృష్ణవేణమ్మ

మనము మాటలాడునదియ భాష యనబడుచున్నది. ప్రపంచముననున్న యందఱకు భాష యొక్కటే కాదు. కేవలము మనదేశములోనే పలుభాష లున్నవి. ఏకభాషకైనను పలుప్రదేశములలో వ్యావహారికముగా ననేక వ్యత్యాసములు సంభవించినవన్నను తప్పుకాదు. దేశీయ పదప్రయోగమున నెంతటి మాధుర్యమున్నదో యంతటి యన్వయసౌలభ్య మితర ప్రాంత్యవాసులకు కలుగకపోవచ్చును.

ఏకరాష్ట్ర వాసులయ్యును భిన్నప్రాంతములలోని జనుల వ్యవహారభాషయం దెంతయో వ్యత్యాసము కనుబడుటలేదా? దాన నొకప్రాంతమువారి వ్యవహారభాష మఱియొక ప్రాంతమువారి కర్థమగుట క్లిష్టముగదా? అర్థముగానిది వ్యర్థము. గ్రంథస్థమగు భాష యన్నిప్రాంతములవారికిని నొక్కరూపు.

భాషారచనలే వాఙ్మయమును పెంపొందించును. సాహిత్యసేవకులెందరో తమ యమూల్యరచనల భాషాదేవికి భూషాయమానంబుగా నొనర్చిరి. రచన ద్వివిధములుగదా! పద్యరచన శాస్త్రబద్ధముగా నుండి తీరవలయునని శాసించిరిగదా! శాస్త్రబద్ధములుకాని భావగీతము లిటీవల వెలువడుచున్నవి. కాని వచన రచనలలోనే వాదవివాదములు వచ్చుచున్నవి. 'గద్యం కవీనాం నికషం వదన్తి' యని పూర్వు లూరకచెప్పిరా? గద్యములకు శబ్దాలంకారము లలంకారములు. అర్థాలంకారములు వానికి మేలిమెఱుంగు. శాస్త్రబద్ధమేయైనను నలంకారహీనములగు గద్యములు హృద్యములు గానేరవు. భాషాభ్యుదయమునకు దోడుపడని రచనలెందుకు వచ్చినట్లు? రచనలను సవరించు నెపమునగదా ఛందోవ్యాకరణాదు లుద్భవిల్లినవి! అలంకారశాస్త్రము లందులకేగదా యావిర్భవించినవి! భాషను శుద్ధిసేయు వ్యాకరణము నేటగలిపిన యశుద్ధరచనలు సాహిత్యమున కమూల్యాలంకారము లగునా?

సామాన్యముగా చిన్న చిన్న విషయములపై చర్చ వచ్చినప్పుడుగాని, వ్యాసములకుగాని వచనమే వాడబడుచున్నది. రచనలలో నిప్పటి యాధునికులు వ్యావహారికమునే వాడుచున్నారు. వ్యావహారికము సులభగ్రాహ్యము. మీదుమిక్కిలి మనకు వాడుకభాషయేగాన ముదావహముగానే యుండుననుట నిర్వివాదాంశము. స్త్రీలకు, పిల్లలకు సహిత ముపకరించుట కనువుగానుండి ముద్దులుమూటగట్టు చుండును. కాని యొకవిషయమును గమనింపకుండుట పొరబాటు కావచ్చును. తెలుగుదేశమున భిన్నప్రాంతీయులలో ఒకరి వ్యవహారిక మొకరి కపరిచితముగానుండుట వారు వీరు కలిసి మాటాడుచున్నప్పుడు గమనించిన నెల్లయు తెల్లమగును. ముఖ్యముగా నేటి వ్యావహారిక రచనలన్నియు నౌత్తరాహులచేతనే రచింపబడుచున్నవి. తదితర ప్రాంతీయులును వాడుకభాష వ్రాయువారు లేరని చెప్పలేదు. వారును ప్రచారముకొఱకో, ప్రాముఖ్యముకొఱకో తదనుకరణమునే సాగించుచున్నారు. ఆంధ్రరాష్ట్రవిభజ నాందోళనమునకు నమోవాకములు. తెలుగురాష్ట్రమును రెండుచేసిన ఉత్తరాంధ్ర రాయలసీమ సంఘర్షణ లింకను శృతిపుటంబుల బడుచునే యున్నవి. నెల్లూరు, చిత్తూరువారు మధ్యమాంధ్రులము మేమని చొచ్చుకొనిరాక యూరకున్నా రెందులకో?

ఉత్తరముననే మండలమండలమునకు వ్యత్యాసములు గన్పట్టుచున్నవి. విశాఖపట్టణమువారిని గోదావరివారు తూర్పునాటివారని యందురుగదా? వారిలో వారికే వాడుకభాషయం దెన్నియో భేదములు చూపట్టుచున్నవి. విశాఖపట్టణమువారి 'గుంటలను' గోదావరి 'కుఱ్ఱవానితో' సరిపోల్పగలమా? వారి 'గుండను' గోదావరి 'పాడుము'లో కలుపనగునా? వారి 'గావంచా'ను వీరి 'కొల్లాయి'గుడ్డను నేసిన

దొకరేనా? విశాఖపట్టణమున చేయబడు 'పన్నెలు' గోదావరీ తీరమున 'దువ్వెన'లుగా మారిపోవుచున్నవి. ఇక రాయలసీమ జేరుదము. 'కుఱ్ఱవాళ్లు' 'గుంటలు' యిచ్చట లేరు. 'పిల్లవాండ్రు' 'పిల్లలు' యిందున్నారు. 'పొడి' యున్నది. 'కుఱ్ఱ' తప్ప తక్కినవి గ్రంథస్థములేనా? 'గారెలు' గ్రంథస్థమే గనుక రాయలసీమలోని యక్షరాస్యుల కర్థమగునేగాని సామాన్యులకు కాదు. వీరి 'వడల' రుచి వారికి తెలియనే తెలియదేమో. 'కాని' నెల్లూరున 'డబ్బు'గా మారి చిత్తూరుమండలమున 'కాలణా' అయినది. అంతటితో నాగక రాయలసీమలో 'బొట్టు'రూప మెత్తినది. వేయేల ద్రవ్యమానములో నేమి, తూనికలో నేమి చాలవఱకు భేదములు కన్పట్టుచున్నవి. రాయలసీమ 'ఊరుబిండి' సర్కారులలో నలిగి 'పచ్చడి'యైనది. దత్తమండలములలో 'దోసెలు' వాడుకలో నున్నవి. ఔత్తరాహుల 'అట్లు' దీనికర్థము చెప్పుటయెట్లు? 'వాళ్లు' 'వీళ్లు' 'కళ్లు' 'పళ్లు' రాయలసీమలో 'వాండ్లు' 'వీండ్లు' 'కండ్లు' 'పండ్లు'గా వ్యవహరించుచున్నారు. వ్యావహారిక భాషలోని కొన్ని పదములు గ్రంథస్థములే. కొన్ని యశ్రుతపూర్వములు. కేవల మొకప్రాంతమున వాడబడు భాషకే ప్రాముఖ్యతనిచ్చిన తక్కుంగలవారిగతి యేమి? ప్రయుక్తమగు భాష యొక్కచోటగాన నందఱకు గ్రాహ్యము. మీదుమిక్కిలి స్త్రీలు, పిల్లలు, భాషాభివృద్ధికి రచనాకౌశలమునకు పత్రికలు గ్రంథములు చదువుచున్నారు. ఇట్టి రచనలతో నేమి వృద్ధియగును? కాని కొన్నిపట్ల వ్యవహారికమే యుచితమగును. పత్రికలు మొదలు గ్రంథములవఱకు కదియే విస్తృతముగా నుండ గూడదను నభిప్రాయముతో పలువు రేకీభవింతురు గదా? దేశీయమనియు వ్యావహారికమనియు, నానా ప్రాంతీయులు, వారివారి వాడుకభాషలలో రచించినచో పత్రికాధిపతులు, వాని కిచ్చగింతురా? భాష నానా ముఖముల జీలిపోవదా? ఒక ప్రాంతము వారి వాడుకభాష తదితరులు నేర్చుకొనవలయుననుట సమంజసమా? తెలుగుపత్రికలు తెలుగువారందఱికిని సమాదరణీయములు గదా? భారత, భాగవతాదులవలె యిట్టివెల్లఱకు సమానమగుభాషలో నున్నచో వ్యత్యాసభావములు పుట్టకుండునుగదా? సంస్కృత యగు కులకన్యక యెట్లు సర్వజనాదరము నొందుచున్నదో యట్లే సంస్కరింపఁబడిన భాషాలలనయు నెల్లఱకుల్లాసము గూర్పకుండునా? విద్యావిశారదలు భాషాభివృద్ధికై పాటుబడి వాఙ్మయమునకు వన్నెదెచ్చు వచనరచనల భాషాయోషకు భూషణముల సమర్పించుట బాగుగదా?

---

## ఏమి యార్జించుకొంటివి?

శ్రీ ఊట్ల కొండయ్య

గీ॥ చంచలాశా మహాదేవి చరణచిహ్ని
తంబు లీ పేదవాకిళ్లు, తద్రథమ్ము
రాకపోకల నలిగిన మూకజీవి
తమ్మ లివి స్వాదుస్వప్నవిదారితములు

గీ॥ 'జన్మజన్మాంతరమ్ముల శ్రమలకోర్చి
తలపుకందని తీయని నెలవులందు
నటునిటుల దీనతావేదనార్తిఁబరచి
ఏమియార్జించుకొంటివో యీ కుమార'

గీ॥ అని యిహమ్మెల్ల ప్రశ్నింప నస్మదాంత
రాంత రాకాశ గహన మహాంధకార
మేదురోదరమందు భ్రమించు నమృత
పల్లవములంటి నా రాణి పదములంటి.

# దొడ్డ యిల్లాలు

శ్రీ గోనెల నరసింగరావు, ఎం. ఏ. బి. ఎల్.

బంగరు బొంగరాలు పరిపాటిగఁ దమ్ములతోడ నాడ నై
శ్యాంగన చూచి కేరడము లాడఁగఁ బాలుఁడు కిన్కఁబూని, మా
తంగని, బ్రహ్మనాయని కథల్ విని, దాయల కెల్ల మిండఁడై
సంగరమాడఁ దీక్షఁగొని జాయను డాయఁగఁబోమె నామెడన్.

సహజ లావణ్యరాశి మాంచాల దాసి
తమిని గొజ్జఁగి నీట పాదములు గడిగి
కలిత నీరాజనంబిడి గారవింప
బాలచంద్రుఁడు కనుఁగొని భ్రమసిపోయి.

కారెమపూడిలో జరుగు కయ్యము దయ్య మెఱుంగు, వీడఁగా
నేరుతు నెట్లు నాప్రియను; నిల్చెదఁగాకిట; కానలోన వి
ప్పారెడు వెన్నెలట్లు వృధ యాగద యౌవన భాగ్యమెల్ల; నే
నేరక చేసికొన్నదగు నేరమె దూరము జేసె నీమెకున్.

"ఎన్నినోళ్ళ దోసఁగుల్పొనర్చితిని నిన్ను నాళ్లుపేక్షించి; నన్
మన్నింపన్ దగు, దాసునిన్, బ్రణయినీ! మాంచాల! యీర్ష్యాళువుల్
గన్నుల్ గప్పుటచేత నీ సహజ సౌఖ్య శ్రీల నోలాడలే
కున్నాఁడన్, సిరి తానె వచ్చిన, నభాగ్యుం డొందఁగా జాలునే?"
"బాలుఁడనై వినోదముల పాలయి ప్రేయసివైన నిన్ను మాం
చాల! సుశీల! నే నరయఁజాలక పోయితి నింతదాఁక; నీ
మేలిమి తాలిమిన్ బరిణమించెడి నీ సునుసోయగమ్ము, నీ
వేళను గూర్మితో ననుభవింపఁగ నీయవె ప్రేమమూర్తివై."

అనుచు వలపున కెద నమ్ముకొనినవాని
జూచి మాంచాల నిజధర్మ సూచకముగ
నతనితో నిట్లు గంభీరమైన నుడుల
వినయము నయమ్ము బెనఁగొన విన్నవించె.

"తనువిది నీటిబుగ్గ సరదాపడ నీయెడ నేమియున్నదే
క్షణమున నేమి కాఁగలదో; శాశ్వతమైనది యాత్మయొక్కటే
యని తమకేను జెప్పవలెనా? పరిణామము లోకమొందఁగా
రణమగు ప్రేమ తద్వికృతి? ప్రాజ్ఞులు మీ రది పొందఁగావలెన్"

"ప్రేమ మొక వ్యక్తిపై నిల్పుటేమి పాడి
కడల దివ్వియవలెఁ గాంతిఁ గప్పవలయు;
నెల్లెడలఁ బూవువలెఁ దావిఁ జల్లవలయు;
సమతయే ధర్మ సమితి సారము మహాత్మ!"

"నీడవలె జరామృతులు వెంటాడు మేను
కొఱకు మురిపెమ్ము విరహమ్ము గొనఁగఁదగునె?
ఓప్రభూ! యమృతత్వమ్ము నొంద వీర
వరులు త్రొక్కిన రహదారి వదలివేసి."

"పుట్టువుఁగంటి మీ తెలుఁగు భూమికిఁ గీరితిఁదెచ్చు కోసమే
పట్టితిమాజిలో రిపులఁ బట్టి కరాసికి బువ్వ వెట్టఁగా
గట్టి వ్రతమ్ము; దానికి దగాయగులాగున లోఁగిపోయి నీ
విట్టులు లోఁగిటన్ మడఁగుటే మగపాడి తలంపుమో దొరా!"

"నీ జనయిత్రినై తమను నిండిన ప్రేముడి వీర పత్నిగా
నీ జనకుండు నేఁడు కరుణించెడి మార్గము ద్రొక్కె నన్ను ని
ర్వ్యాజకృపారసంబాలికి యీ మహితస్థితి నందఁజేయుమో
రాజకుమార! నీకిదె కరమ్ములు మోడ్చి నమస్కరించెదన్"

# విషమ సంఘటన

శ్రీమతి నందగిరి ఇందిరాదేవి



'ఏమండోయి! ఇవ్వాళయితే తప్పించుకోటానికి వీల్లేదు. ఎన్నాళ్లయింది చూడండి! మనం సరదాగా సినిమాకు వెళ్లక!' అన్నది లీల చిరునవ్వుతో చూస్తూ ప్రకాశంగారితో, తాగిన టీ కప్పు బల్లమీద పెట్టి.

ప్రకాశరావు ఎలక్ట్రిక్ షాకు తగిలినవానికి మల్లే అదిరిపడి అది కప్పిపుచ్చుతో 'పాడుమీటింగు ఇవ్వాళే వచ్చిపడింది క్లబ్బులో. ఇవ్వాళటికి క్షమించు' అని ఒడుదుడుకుగా జవాబుచెప్పాడు, తప్పించుకోవాలన్న ఉద్దేశంతో, బల్లమీది పళ్లెంలోని బీడా వేసుకుని లేస్తూ.

'అబ్బ! ఎప్పుడూ ఉంటాయి మీకు మీటింగులు. నాకు తెలుసునులెండి. నాతో రావటం అంటే మీకు ఇష్టంఉండదు. ఎప్పుడూ ఇదే సమాధానం అని అంటూ ఉండగానే, రాముడు 'అయ్యా!' అని అరిచాడు పరదా అవతలినుండి.

'ఏమిరా?' అన్నది లీల.

రాముడు లోపలికివచ్చి 'అయ్యగారితో అర్జంటుగా మాట్లాడాల్సిన పని ఉన్నదట ఎవరో ఒకాయన వచ్చాడు' అన్నాడు.

ప్రకాశరావు విసుగుకుంటూ 'ఇప్పుడు బయటవెళ్లే సమయమని చెప్పమనలే నీకు ఎవరొచ్చినా కూడా?' అన్నాడు.

రాముడు నీళ్లు నములుతో వెనక్కివెడుతూ 'అలాగే చెప్పాను కాని తప్పనిసరిగా మాట్లాడాల్సిన పని ఉన్నదని లోపలికివచ్చి కూర్చున్నాడు. ఇప్పుడు కలవటానికి వీల్లేదు అని అంటేకూడా వినిపించుకోటంలేదు'.

'ఎట్లా ఉన్నాడు మనిషి?' అని అడిగాడు ప్రకాశరావు.

'కొంచెం జబ్బుమనిషిలా ఉన్నాడు. చేతికి కట్లు ఉన్నాయి. బక్కగా ఉన్నాడు. ధోవతీ కట్టుకున్నాడు.' అన్నాడు రాముడు.

చేతికి కట్లున్న జబ్బుమనిషి అనేటప్పటికి ప్రకాశం ముఖంలో కళ లేకుండా దిగులు ఆవరించింది. ఏదో జ్ఞాపకం వచ్చినవాడిలాగా 'ఆ వెధవే అయిఉంటాడు. వీడు నన్ను వొదిలేటట్టు లేడు.' అని అనుకుంటూ డ్రాయింగురూములోకి వచ్చాడు. ఆ కూర్చున్న వ్యక్తి లేచి 'నమస్కారాలు' అన్నాడు. ప్రకాశం అదేదీ వినిపించుకోకుండా 'ఎవరు మీరు? ఎందుకు వచ్చారు? త్వరగా తెముల్చండి' అన్నాడు. అతను కూర్చుని 'నేనెందుకు వచ్చానో నన్ను చూచే తెలుసుకుంటారనుకున్నాను' అన్నాడు.

'మీరెందుకు వచ్చారో మీ మొహాన రాసిలేదు. అందుకని కధ పెంచక నా సమయం వృధా చెయ్యవద్దు' అన్నాడు ప్రకాశం.

ఆ వ్యక్తి 'సరే. మీరింత తీవ్రంగా ఉన్నారు కనుక నేనుకూడా తొందరగానే ముగిస్తాను. రెండునెలలక్రింద రాత్రి సుమారు పదిగంటలప్పుడు జరిగిన విషమ సంఘటన జ్ఞాపకం ఉండొచ్చు. మీరు రాంగుసైడున కారు నడపటంవల్ల నేను మీకారుక్రింద పడటం, నన్ను మీరు హాస్పిటలుచేర్చటం, మీరు ఇంకా మరచిపోలేదనుకుంటూ. మీరు అప్పుడు నన్ను చాలా ఆదరించి నాకు అపాయంవల్ల కలిగిన నష్టం నా ఖర్చులు భరిస్తానని వాగ్దానం దయచేశారు. నేను హాస్పిటలులో ఉండగానే మీకు రెండు మూడు ఉత్తరాలు వ్రాసుకున్నాను. కాని మీరు మీ మాటపై నిలబడలేదు. నన్ను నిన్ననే హాస్పిటలునుండి విడుదలచేశారు. నాకు చేస్తానన్న సహాయం అర్థించటానికి, తప్పకుండా లభిస్తుందన్న ఆశతో వచ్చాను.' అంటూ తాను వచ్చిన పని ఏకరవుపెట్టాడు.

ప్రకాశం చాలా నిర్లక్ష్యభావంతో 'నేను నీకు వాగ్దానాలు చెయ్యలేదు. నీకు చేయాల్సిన సహాయం ఇదివరకే చేశాను. ఇక ఆట్టే విసిగించక కదలవచ్చు' అన్నాడు.

యువకునికి చుర్రుమన్నది. అయినా నెమ్మదిగానే 'అయితే అవన్నీ అప్పుడు తప్పించుకోటానికి అన్నమాటలేనా? ఈ అపాయంవల్ల నేను నా పిల్లలు ఎంత కష్టపడ్డామో ఏమన్నా గుర్తించారా?' అన్నాడు.

'అనవసరంగా ఏమిటీ సొద అంతా! నీకు కలిగిన అపాయానికి నేను బాధ్యుడనుకాను. నా కారుకు అడ్డమొచ్చినందువల్ల అనవసరంగా నా ఎంగేజిమెంట్సు అన్నీ డిస్టర్బు అయిపొయ్యాయి' అన్నాడు ప్రకాశం.

'అవును! ఆమాత్రం నేను తెలుసుకోలేకపోతే! మీ కారుక్రింద ఒకమనిషి పడిపోయినందువలన ఆనాడు మీరు సినిమాకు వెళ్ళకుండా ఆగిపోవాల్సి వచ్చింది! అయ్యయ్యో! ఎంత ఇబ్బంది!

కాని కొంచెం మీ దృష్టి మావేపు మరల్చిచూడండి. ఇంట్లో సంపాదించేవాడు మూలబడటం, పిల్లలు జబ్బుతో కుంగిపోవటం, ఇంటి ఇల్లాలు పిల్లలను చూసుకుని హాస్పిటలుకు తిరగటం! మీరు ఇలాంటి కష్టాలను ఊహించనన్నా ఊహించగలరా? కార్లలో షికార్లుకొట్టే మీకు ఒకమనిషి కారుక్రింద పడటం సామాన్యవిషయంగా తోచింది' అని దులిపేశాడు.

'చూడు అబ్బాయి! నా దగ్గరనుండి నీకు ఏమాత్రం సహాయం లభించదు. నేను చేయదలచుకున్న సహాయం ఆనాడే చేశాను. నాకిప్పుడు చాలా తొందరపనులున్నాయి' అంటూ వెళ్లిపోబొయ్యాడు ప్రకాశం.

ఆ యువకుడుకూడా లేచాడు. 'సరే! నమస్కారాలు!' అంటూ చరచరా ఇవతలికి వచ్చేశాడు. కొంచెం ఆలోచించి స్థిరనిశ్చయంతో తోటవేపు వెళ్లాడు. తోటలో ఎవరో ఆడమనిషి కనపడగానే కొంచెం సందేహించి మళ్లీ ఆమెను పలకరించాడు. 'నన్ను దొరసానిదగ్గరకు తీసికొనివెళ్ళగలరా?' అని అడిగాడు.

'ఏ దొరసాని?' అన్నది లీల.

'వారే! ప్రకాశంగారి భార్యగారు.'

'నేనే! ఏంకావాలి నీకు?'

యువకుడు కొంచెం ఎగాదిగా చూసి 'మీరేనా? చీరకట్టుకున్నారు కనుక సరిగా గుర్తించలేక పోయ్యాను.'

'అదేమిటి? ఒకనాడు ఫ్రాకులు వేసుకున్నానా ఏమిటి? యెప్పుడూ చీరకట్టక?'

యువకుడు కొంచెం తొట్రుపాటుతో 'ఆ-అదే-అవును. ఆనాడు ఫ్రాకు వేసుకున్నారు. మీరు నన్ను గుర్తించలేదా?'

'ఏనాడు? ఎవరు నీవు?'

యువకుడు కొంచెం నవ్వాడు.

'మీకయితే అసలే జ్ఞాపకం లేనట్టుంది. రెండు నెలల క్రింద. పదిగంటల సమయం అప్పుడు. మీరు మీ భర్త కారులో వెడుతోండగా మీ కారు నామీదినుండి పోయింది. నేను పడిపోగానే మీరు ఎంతో దయతో రక్తాన్ని తుడిచి ఇదుగో ఈ దస్తీతో కట్టుకట్టారు. మీకు నా కృతజ్ఞతను తెలుపటానికి వచ్చాను. నేను ప్రకాశంగారిదగ్గర నా భార్యా పిల్లల కష్టాలు చెప్పుకుని ఏమన్నా డబ్బు సహాయంకోసం వచ్చాను. కాని వారు వెళ్లిపొమ్మని కసరికొట్టారు.'

లీల ఇదంతా విని 'రెండు నెలల క్రింద నేనెక్కడున్నాను? అమ్మదగ్గరకు వెళ్లాను కదూ?' అనుకున్నది.

యువకుడు చప్పున సంగతి గ్రహించాడు. ఎంతో అమాయికంగా ఒకగుండీ నొక్కేటప్పటికి దానికి సంబంధించిన మెషీనులన్నీ తిరగటం ఆరంభించాయి. ఆపుదల చేతామనుకున్నా చేయి మించిపోయింది.

'ఆ! అయితే - ఇదంతా పొరపాటు' అంటూ ఏదో గొణిగాడు. కాని లీల అతనిచేతిలోఉన్న దస్తీని లాక్కుంది. దానిమీద 'మేరి'అని కుట్టిఉన్నది. లీలకు అదివరకు భర్తమీద అనుమానాలన్నీ స్థిర పడ్డాయి. తనతో సినిమాకు రావటం అన్నా, తనతో సరదాగా మాట్లాడటం అన్నా భారంగా యుండటం ఇందుకే ననుకున్నది. కోపంతో ముఖంఅంతా ఎర్రబారింది. డ్రాయింగురూములోకి దారితీసి యువకుణ్ణికూడా వెంటరమ్మని సైగచేసింది.

ఆడుసింహంలా గర్జిస్తూ ప్రకాశందగ్గరికి వెళ్లింది. ప్రకాశం ఈమెనుచూచి వెళ్లిపోవటానికి, ప్రయత్నంచేశాడు. కాని ఆమె "చూడండీ! ఇతనికి నూరురూపాయల చెక్కువ్రాసి యివ్వండి. అబ్బా! ఎంత దగామాటలు? ఇంకనైనా తప్పు ఒప్పుకుంటారా?" అని చురచుర చూచింది.

---

# ఉద్వేగాలు

'పాప'



ఉద్వేగాలంటే నాకు చాల అసహ్యం. ఏమీ కారణంలేకపోయినా ఏడవగలగడం ఒక గొప్ప తనమేమోగాని సంఘమర్యాదకీ, నాగరికతకీ తగినదిమాత్రం కాదు. పెద్దవాళ్లెవరయినా కంట నీరుపెట్టుకుని ఏడిచారంటే నాకు రోత. నాకేగాదు నాగరికతఅంటే తెలిసినప్రతీవాడికీని. హరిశ్చంద్రనాటకంలో కూర్చుంటే వేషాలు వేసేవాళ్లు సరిగా ఏడవలేకపోయినా, మనకి అటూ ఇటూ కూర్చున్నవాళ్లు ముక్కులు చీదుకుంటూ, గొంతులు సవరించుకుంటూ కళ్లనీరు తుడుచుకోడం చూసినప్పుడల్లా 'అరెరే! ఏమిటీ మూఢత్వం?' అనుకుంటాను. పరామర్శకి వెళ్లే పెద్దమనుష్యులంతా తేలికగా కళ్లనీళ్లు తెప్పించుకుని కష్టమంతా తమదయినట్టుగా నటించగలగడం చాలా కష్టమేమో గాని, అది సభ్యత ఎంతమాత్రం కాదని నా నిశ్చితాభిప్రాయం.

నాకు ముప్ఫయిఏళ్ల క్రిందటి మాట జ్ఞాపకం వస్తోంది. మా చెల్లెలి నప్పుడు శేషి అనేవాళ్లం. దానికి అయిదోఏడు, నాకు తొమ్మిది. మా అమ్మమ్మగారి ఇంటిదగ్గర మాకిద్దరికీ బాగా అలవాటు. మా అమ్మ లేక పోయినా ఒకటి రెండువారాలు మా అమ్మమ్మదగ్గర శేషి ఉంటూఉండేది. మా అమ్మ నాన్నా కాశీ రామేశ్వరాలు యాత్రవెడుతూ, ఉండగలమనే ధైర్యంమీద శేషినీ, నన్ను అమ్మమ్మగారింటిదగ్గర వదలి వెళ్లిపోయారు.

అప్పుడు మా శేషి చాల చలాకీగా ఉండేది. అది అంటే అందరికీ చాల ముద్దు. అంతా దాన్నే ఎత్తుకునేవారు. అంచేత నాకు కొంచెం ఈర్ష్యగా ఉండేది. దానిమీద నాకు అధికారం ఉందని నిరూపించుకోడానికి అప్పుడప్పుడు కొంచెం కేకలు వేసేవాడిని. దానికి కోపంవస్తే, 'రాజిగాలి జతుందను' అనేది. నేను కొంతసేపు జవాబు చెప్పకుండా కూర్చుంటే దగ్గరగా వచ్చి, 'ఉంతానులే నన్నెప్పులూ అల్లాఅనకేం మరి?' అని సమాధానపడేది.

దానిమాటలు అందరికీ నవ్వువచ్చేవి. ఒకనాడు రాత్రి గదిలోకి ముందు మా అత్తయ్య వెళ్లింది. తరువాత మా మామయ్య వెళ్లాడు. మామయ్య తలుపు దగ్గరగా వేసుకుంటున్నాడు. అప్పుడు మా అమ్మమ్మ పక్కని పడుకున్న శేషి ముఖం అదోమోస్తరుగాపెట్టి అందిగదా, 'ఛీ! అసయ్యమమ్మ! ఎవరన్నా గదిలో తలుపేసుకు పరుకుంతారేంతి! ఛీ!' అని. మామయ్య వెంటనే తలుపుతెరిచి పకపక నవ్వి దాన్ని ఎత్తుకొని గదిలోకి తీసుకువెళ్లాడు. మా అత్తయ్య దానికో పాట నేర్పింది.

'అలంకరించుకోవే కోడలా! అత్తవారింటికి పోవాలి'

అసలుపాట ముద్దుగా ఉన్నా లేకపోయినా, మాచెల్లి భాషలో అది రూపాంతరం పొంది ఎంతో ముద్దుగా ఉండేది. మేము అమ్మమ్మగారింటిదగ్గర ఉన్నప్పుడు పక్కఇంట్లో ఒక అమ్మాయికి కార్యమయింది. మేమంతా భోజనానికివెళ్ళాము. నాలుగోనాడు ఆ అమ్మాయి అత్తవారింటికి వెళ్లేనాడు మావాళ్లంతా చూడ్డానికి వెడుతుంటే, నేను శేషీకూడా వెళ్ళాము. ఆ అమ్మాయి ఒకగదిలో చీరకట్టుకుంటోంది. శేషి ఆడుతూ పాడుతూ అక్కడికివెళ్లి పాడింది.

'అలంకరించుకోవే కోడలా! అత్తవారింటికి పోవాలి.'

ఆపాట అర్థం దానికి అసలు తెలియదు. కాని పాపం ఆ అమ్మాయి కళ్లనీరు పెట్టుకుంది.

ఎవరూ లేకుండా ఆడుకుంటూ ఉన్నప్పుడల్లా ఈపాటే అది పాడుకుంటూ ఉండేది. గంతులువేస్తో, పువ్వులు కోసుకునేటప్పుడు, మట్టితో ఇల్లు కట్టుకునేటప్పుడు అదేపాట!

‘అలంకరించుకోవే కోడలా! అత్తవారింటికి పోవాలి.’

కాని చివరకి శేషి అత్తవారింటికి పోయేనాటికి ఈపాట దానికి జ్ఞాపకంలేదు.

శేషి అమ్మకోసం బెంగపెట్టుకున్నా అభిమానంచేత పయికిచెప్పేదికాదు. ఒకనాడు నేను అన్నాను ‘శేషి అమ్మకోసం బెంగపెట్టుకుందోయి’ అని.

దానికి రోషం వచ్చింది, ‘ఎదవా! నువ్వే బెంగత్తుకున్నావు’ అని ఏడుపు మొదలుపెట్టింది. ఆనాడే మొదలు దానికి జ్వరం. అది ఓపిక ఉన్నంతవరకూ తిని, తిరగడంమాత్రం మానలేదు. ఆరోజునుంచీ అది ఎవరితోటీ అట్టే మాట్టాడేదికాదు.

ఒకనాడు అది మట్టితో ఇల్లుకడుతూ తనలోతను అనుకుంటోంది, ‘ఇది అమ్మకీ, ఇది నాన్నకీ, ఇది నాకూ, ఇది అన్నయ్యకీ, ఛీ! ఇది అన్నయ్యకి లేదు. నన్ను బెంగత్తుకున్నానన్నాడు, నేను బెంగత్తుకున్నా నేంతి?’

దాని కళ్లలోకి ఏడుపు వచ్చేసింది. వెంటనే లేచి, కాలితో ఆ ఇల్లు తన్నిపారేసి గొంతుఎత్తి పాడింది, ‘అలంకరించుకోవే కోడలా, అత్తవారింటికి పోవాలి.’

కాని ఏడుపాగలేదు. కళ్లు నులుపుకుంటూ వెనక్కి తిరిగితే నేను కనబడ్డాను. మళ్లీ అభిమానపడి, ‘అలంకరించుకోవె కోడలా...” శక్తికొలదీ గొంతుఎత్తి పాడింది.

‘అన్నయ్యా! మనం మనూరెల్లిపోతాం కదూ?’

‘అమ్మ, నాన్న వచ్చాకాను’, అన్నాను నేను.

‘వచ్చాకేలే’ అంది.

మరునాడు అది మంచంమీదనుంచి లేవలేదు. మా అమ్మమ్మ చాల భయపడింది. నిద్రలో అప్పుడప్పుడు పలవరింతలు. మా నాన్నకి తంతి ఇచ్చారు.

రెండు రోజులు శేషి కళ్లువిప్పలేదు. మూడవనాడు మధ్యాహ్నం కొంచెం తెలివివచ్చి నాలుగు ప్రక్కలా కలియచూసింది. తను అనుకున్నదేదో కనబడనట్టుగా ఊపిరివిడిచి మళ్లీ పడుకుంది. మా అమ్మమ్మ దగ్గరగావెళ్లి, ‘ఎల్లా ఉందమ్మా?’ అంది.

‘మావూరే బాగుంతుంది మీవురుకంతే’ అంది శేషి.

‘అమ్మ వస్తుందీ, బెంగపెట్టుకోకే తల్లీ! నీకు ఎంచక్కా ఎన్నో తెస్తాడు నాన్న. అన్నయ్యకొక్కటీ ఇవ్వకేం?’

‘మా అమ్మ వచ్చేకానూ మా వూరెల్లిపోతాం గాదూ?”

'అల్లాగే తల్లీ!'

'అన్నయ్యే బెంగత్తుకున్నాలు. నేను బెంగత్తుకోలేదు.'

'అవునమ్మా! నువ్వు బంగారుతల్లివి.'

ఇంతలో మాఅమ్మ తలుపుతెరచుకొని ఒక గాలివానలా వచ్చిపడింది. శేషి మాఅమ్మ భుజంమీదికి ఒక్క ఎగురు ఎగిరింది. ఇద్దరూ చాలాసేపు మాట్లాడలేకుండా ఏడిచారు.

'నాతల్లి నొక్కత్తినీ వదలి వెళ్లిపోయానమ్మ! నాతల్లిని', అంది మాఅమ్మ కళ్లనీళ్లు తుడుచుకుంటూ.

శేషి వెక్కివెక్కి ఏడుస్తూ 'అన్నయ్య నన్ను బెంగత్తుకున్నావన్నాలు' అంది.

'కొడదాంలే అమ్మ, అన్నయ్యని' అని సముదాయించింది మా అమ్మ.

నాకు మాఅమ్మమీద చాలాకోపం వచ్చింది. మా శేషి ఏడిచిందంటే చిన్నపిల్ల, మాఅమ్మ ఎందుకు ఏడవాలి? అయినా నేనుమాత్రం బెంగెట్టుకోలేదూ?

మా అమ్మ బుజ్జగించినప్పుడు నాకూ ఏడుపు వచ్చింది! మా శేషి మాత్రం ఆనాడే సుఖంగా పాడింది, 'అలంకరించుకోవే కోడలా! అత్తవారింటికి పోవాలి.'

పెళ్లిఅయిన తరవాత మా శేషి శేషు అయింది. బావ అల్లాగే పిలిచేవాడు దాన్ని. దాని అదృష్టం మంచి కుటుంబంలో పడడమే కాదు, మంచి మొగుడుకూడా దొరికాడు.

మాబావ ఆవేళ ఇంగ్లాండు వెడతాడు బారిష్టరు పరీక్షకి. కాని బారిష్టరంటే అప్పటికీ, ఇప్పటికీ మా శేషుకి ఏమిటో తెలియదు. అదేదో ఉద్యోగమనుకునేది.

నేనూ, మాబావా గదిలో కూర్చున్నాం. గబుక్కుని తలుపుతోసుకుని 'నల్లవాడే గొల్లపిల్లవాడే' అంటూ పాడుకుంటూ వచ్చింది. బావ గదిలో ఉన్నట్టుగా అది ఎరగదు. అందువల్ల వెంటనే నాలిక కరుచుకుని పాట మానివేసింది. మాబావ అన్నాడు 'అబ్బా! ఎంత భయం నటిస్తున్నావు?'

'అయితే పోనీయండి, మానివెయ్యనే వెయ్యను.'

మళ్లీ పాడింది 'నల్లవాడే గొల్లపిల్లవాడే.'

బావ పకపకమని నవ్వాడు. అందుకు కారణం ఉందికూడా. బావ నల్లగా ఉంటాడు. నాకూ నవ్వు వచ్చింది. శేషు సిగ్గువచ్చి ముఖం తిప్పుకుని వెళ్లిపోయింది.

మేం సావిడిలోనుంచి భోజనాలకి పోతూఉంటే ప్రక్కగదిలో మళ్లీ అదేపాట, నెమ్మదిగా తనలో తను పాడుకుంటూను. నేను తలుపు తొయ్యబోయాను. కాని మాబావ నా చెయ్యిపట్టుకు ఆపి కొంత సేపు విన్నాడు.

భోజనాలయి అంతా సావిడిలో కూర్చున్నాం. బావ మంచంమీద వెల్లగిల పడుకున్నాడు. మా అందరి ముఖాలూ దీనంగా ఉన్నాయి. బావ వెళ్లిపోతాడు ఆవేళ. మళ్లీ ఎన్నాళ్లో.

ఒకకుర్చీలో బావకి కనబడకుండా కూర్చుని తమలపాకులికి ఈనెలుతీస్తోంది శేషి. పాడుకుంటోంది.

'నల్లవాడే గొల్లపిల్లవాడే.'

బావ తదేకదీక్షతో వింటున్నాడు. కాని తను ఆపాట పాడుతున్నట్టుగా అది ఎరగదు. కళ్లు దీనంగా ఆలోచిస్తున్నాయి. పెదవులు ఏడవడానికి సంకోచిస్తున్నాయి. ఊర్పుతో ముక్కు కొంచెంగా అదురుతోంది.

ఇంతలో మా చిన్నతమ్ముడందుకున్నాడు, 'నల్లవాడే గొల్లపిల్లవాడే.'

శేషుకి అప్పటికి తెలిసింది తనాపాట పాడుతున్నట్టుగా. వెంటనే ముఖం ఎత్తిచూసింది ఎవరన్నా కనిపెడుతున్నారా అన్నట్టు. మా తమ్ముణ్ణి దగ్గరగాపిలిచి ప్రోత్సహించింది,

'పాడరా తమ్ముడా'

'నువ్వే పాడరాదు? సరదాగాఉంటే. ఇందాకటినుంచీ పాడుతున్నావుగా!' అన్నాడు బావ.

శేషు లేచి తమలపాకులు బావచేతికి ఇచ్చి చిరునవ్వు నవ్వుతుంటూ వెళ్ళిపోయింది లోపలికి.

బావ, నేను, ఊళ్లో చుట్టాలని చూడ్డానికి వెళ్ళి మూడుగంటలకి ఇంటికి తిరిగివచ్చాం. శేషుగొంతు గట్టిగా వినబడుతోంది, 'నల్లవాడే గొల్ల పిల్లవాడే'.

గొంతుక సాఫీగాలేదు. గట్టిగా పాడినకొద్దీ కొంత జంకుతోంది, రాబోయే కన్నీటితో ఆమె దెబ్బలాడుతోందా అనిపించింది. బావ గదిగుమ్మంలోకి వెళ్లి నిలబడ్డాడు. ఆమెకళ్లలో నీళ్లు తుడుచుకోడానికి సావకాశంలేకపోయింది. చ్రటునలేచి లోపలికి పారిపోయింది.

మాబావ ఎంతో సానుభూతితో చిరునవ్వు నవ్వబోతూ కొంతసేపు అల్లా నిలబడ్డాడు.

నేనూ, శేషూ బావని సాగనంపడానికి స్టేషనుకివెళ్లాం. రైలు రావడానికి ఇంకా ఒక పావుగంట వ్యవధి ఉంది. ఎవరమూ ఏమీ మాట్లాడకుండా నిలబడ్డాం.

బావేఅన్నాడు చివరకి, 'నేనింకో పావుగంటలో రైలులో ఉంటాను.'

'మీతాళంచెవులో పాపం?'' అంది శేషు. బావ జేబు తడుముకొని 'ఓహో! నువ్వు తీశావా ఏమిటి?'' అన్నాడు.

'ఇదీ బాగానేవుంది, నేనేం ఎరుగుదును?'

కాని అదే తీసినట్టుగా చెప్పడంలోనే తెలిసిపోయింది. బావ రెట్టించి అడగలేదు.

రైలువచ్చి ఆగింది. సామాను రైలులోఎక్కింది.

శేషునిచూస్తే నాకు గుండెలు దడదడ కొట్టుకున్నాయి. కొంచెం ముఖం కిందికి వంచింది. పెదవులు సగం విప్పిఉన్నాయి. వేలిగోటితో మునిపంటిని నొక్కుతూ నిలబడింది. కళ్లలో నీటిబిందువులు ఇంక చెక్కులమీదికి జారడమే తరవాయి. వాటిని తుడుచుకుంటే తనుఏడుస్తో ఉన్నట్టు అందరికీ తెలిసిపోతుందని అల్లాగే నిలబడిఉంది.

బావ దగ్గరగా వెళ్లాడు. శేషు తల ఎత్తలేదు.

"వెడుతున్నాను" అన్నాడు.

శేషు తాళంచెవులగుత్తి బావచేతిలో పెట్టింది. బావ ఆ చేతిని తనచేతిలోకి తీసుకున్నాడు.

"ఛీ! ఏడవకు. ఎందుకు ఏడుస్తావు?" అన్నాడు.

శేషు లేదన్నట్టు తల ఊపిందిగాని కన్నీటిని తుడుచుకోలేదు.

"ఇదిగో ఇల్లాచూడు. నే వెళ్లి రానా?"

శేషు సరేనన్నట్టు తలఊపింది. బావ శేషువీపుమీద ఒకసారి నిమిరి ఒక నిట్టూర్పు విడిచి రైలు ఎక్కాడు.

ఇంక మా శేషుకి అభిమానమంతా పోయి ముఖమెత్తి రైలువైపుచూస్తో మనసారా ఏడిచింది. ఎవరన్నా చూస్తే ఏమనుకుంటారు? నేను ఊరుకో బెట్టడానికి వీలేనిపరిస్థితి అది. అసలు అటువంటి పరిస్థితులంటేనే నాకసహ్యాం. ముఖం చిట్లించి, మా శేషుని ఊరుకోబెట్టే బాధ్యత ప్రకృతికి వదలివేసి, ఇంకో పక్కకి తిరిగిచూస్తో నిలబడ్డాను.



శేషు తరవాత శేషప్ప అయింది. ఈలోగా చాలామార్పులు జరిగాయి. శేషప్ప అదృష్టం తల కిందు అయింది. మా బావ చాలా చిన్నవయస్సులోనే పోయాడు. ఆమెకు ఒక ఆడపిల్ల. డబ్బుకి లోటు లేదు. మా బావ అట్టే సంపాదించేదాకా బతక్కపోయినా అసలు వాళ్లస్థితిగతులు మంచివి. బావ పోయిన తరవాత శేషప్ప మాదగ్గరే ఉంటూవచ్చింది. మా మేనకోడలికి ఒకమంచి సంబంధంచూసి పెళ్లిచేశాం. కుఱ్ఱవాడు బి. ఎ. ప్యాసయాడు. స్థితిగతులు చెప్పుకోతగవి కాకపోయినా లోటులేని సందర్భం. కార్యంకూడా అయిపోయింది. అతను బి. ఎల్. చదివే ఉద్దేశ్యంతో కాపరం మద్రాసులో పెట్టదలచుకున్నాడు. ఇంకొక వారం రోజులికి అతను మద్రాసు వెడతాడనగా నేను స్వయంగా అతన్ని మాయింటికి తీసుకొచ్చాను.

మా ఊరివారందరికీ పదోసారి శేషప్ప తన అల్లుణ్ణి చూపించి అంటూవచ్చింది, 'మా అల్లుడండీ మద్రాసులో కలట్రీ చదవడానికి వెడుతున్నాడు'—బి. ఏ. అయినతరవాత ఏది చదివినా కలట్రీ అనే దాని నమ్మకం. అల్లుడు తనలో తను నవ్వుకుని ఊరుకునేవాడు.

నేనుమాత్రం మందలిస్తూ అన్నాను, 'ఒసే, కలట్రీ ఏమిటి? అదంత తేరగా ఉందనుకుంటున్నావా?' అల్లుణ్ణిగురించి అంత తెలిసిపోయేటట్టు గొప్ప చెప్పుకోవడం సభ్యతకాదని నా భయమేమో!

'ఆరి నీయమ్మా కడుపు బంగారంగానూ, మరి నాకా పరీక్షలు ఏవో తెలియవురా'. మా శేషప్ప మాత్రం పకపకనవ్వింది.

కూతుర్ని దగ్గరగా తీసుకుని బుజ్జగిస్తూ అంది, "మాతల్లి ఏం కష్టపడుతుందో చెన్నపట్టణంలో. మాటా తెలియదు మంతీ తెలియదు గావును"

అల్లుడి ఎదుట కూతుర్ని అల్లా బుజ్జగించడం నాకు ఎందుకో నచ్చలేదు. 'మరేం ఫరవాలేదు. నీకుమల్లే వెర్రిబాగుల్ది కాదుఅది' అన్నాను.

'ఆరి నీ యమ్మాకడుపు బంగారంగానూ, దానికేంతెలుసురా పాపం'

తను పెద్దదని, పైకి ఏడవకూడదనే సంగతి దానికీ కొంతవరకూ తెలుసును. ఆ వారం రోజుల్లోనూ చాటుగా ఎన్నోసార్లు కళ్లుతుడుచుకోడం నేను చూశాను. కాని అల్లుడుచూస్తే అమర్యాద అని నా అనుమానం. ఆమె ఏడుపు నటన కాదని నాకుతెలిసినా నాగరికత వాంఛించే ఇతరులఎదట అది వెకలితనంగా, నటనగా అగుపడిపోతుందేమోనని నాభయం. శేషప్ప చివరదాకా తననికూడా అల్లుడు మద్రాసు రమ్మంటాడేమోనని మహా ఆశపడింది.

వెళ్లేనాడు మేమంతా భోజనాలు అయాక సావిడిలో కూర్చున్నాము. అల్లుడు పత్రిక చదువుతున్నాడు కుర్చీలో కూర్చుని.

'ఏమోయి! మద్రాసులో ఏవో రోడ్లమీద నడిచే బళ్లు ఉంటాయట గాదూ?' అంది అల్లుణ్ణి ఉద్దేశించి.

'ట్రాములా అండి' అన్నాడు అల్లుడు.

'రోడ్డుమీదయితే ఎల్లా ఎక్కుతారవి?'

'వెళ్లిచూస్తేగాని అర్థంకాదు' అన్నాను నేను.

'పోనీ నేనూ వెడతాను.' అల్లుడుమాత్రం వినబడనట్టు పత్రిక చదువుతున్నాడు.

అల్లుడికి వినబడకుండా నేను మందలించబోయాను.

'అటువంటి ఉద్దేశ్యాలు మనసులోఉన్నా పైకి తేలిపోవడం మంచిదిగాదు.'

'అరి నీయమ్మకడుపు బంగారంగానూ. ఇందులో తప్పేమి ఉందిరా?'

మా మేనకోడలు గదిలోకి రాబోయి మొగుణ్ణిచూసి మళ్లీ వెనక్కి వెళ్లిపోబోయింది.

'రా అమ్మా! ఇల్లావచ్చి కూర్చోవచ్చు'. అది వచ్చి శేషప్పపక్కని కూర్చుంది.

'మాతల్లి వెళ్లిపోతుం దీవేళ' ఒక్కసారి ముక్కు పైకి ఎగపీల్చుకుంది. కళ్లలో నలకపడ్డట్టు నటించి కళ్లు తుడుచుకుంది.

'మళ్లీ శలవుల్లో తప్పకుండా వచ్చెయ్యండోయి' అంది అల్లుణ్ణి ఉద్దేశించి.

'అల్లాగేలెండి'' అన్నాడు అల్లుడు పత్రిక చదువులోనే.

శేషప్పకళ్లు ఈసారి నీళ్లతో నిండిపోయాయి. మేము ఏమీ అనుకోకుండా ఉంటే భోరుమని ఏడిచేదే. అల్లుడిముఖానికి పత్రిక అడ్డుఉంది. శేషప్పముఖం పక్కకి తిప్పుకుని కళ్లు తుడుచుకుంది. ''పేపరు విశేషాలేమిటోయి?'' అంది. అనవసరపు ప్రశ్న!

కొంగు పరుచుకుని అవతలి పక్కకి తిరిగి పడుకుంది. ఈ సారి అది ఎంతదాచుకోడానికి ప్రయత్నించినా దుఃఖం ఆగలేదు. అల్లా పడుకుని ఉండగా ఆమెకు ఎప్పుడు నిద్రపట్టిందో తెలియదు. నేను ఉన్నంత సేపూ అది ఏడుస్తూఉందనే అనుకున్నాను. రైలువేళదాకా అది అల్లాగే నిద్రపోయింది.

నేను లేపాను. 'అరి నీ యమ్మకడుపు బంగారంగాను'' అంటూ కళ్లు నులుపుకుంటూ లేచింది. రైలు వేళయిందని చెప్పాను. ఆమాట కొంతసేపటివరకూ దానికి అర్థంకాలేదు.

బండివచ్చింది. సామానంతా బండిలో పెట్టుకున్నాడు బండివాడు. అల్లుడువెళ్లి అవతల బండిదగ్గర నిలబడ్డాడు. మా మేనకోడలు అడుగుల్లో అడుగు వేసుకుంటూ తల్లిదగ్గరకు వచ్చింది.

'అయ్యో! తల్లీ. వెళ్లిపోతున్నావా అమ్మా!'

శేషప్ప భోరుమంది. అల్లుడు ఎదురుగా ఉన్నాడన్న సంగతి పూర్తిగా మరిచిపోయింది. వెక్కి వెక్కి చిన్నపిల్లలా ఏడిచింది. ఇంక రైల్లువేళదాటిపోతుందని అల్లుడు తొందర పెట్టినమీదట కూతుర్ని రైలులో ఎక్కనిచ్చింది. బండివెళ్లిపోయినా అది ఏడుపుమాత్రం మానలేదు.

అయితే అప్పుడప్పుడు నాకో ప్రశ్న వస్తూ ఉంటుంది. మనసులో విచారాన్నంతనీ పైకి వదలి వెయ్యడం తప్పా? దానికి నా మనసులో ఒకటే సమాధానం. తప్పుకాకపోయినా సభ్యతకాదు. అయితే అటువంటి పరిస్థితుల్లో నేను ఏం చెయ్యాలి? దానికి మాత్రం నా మనసులో సమాధానంలేదు.

# ఇంకా ఛాందసమేనా!

శ్రీ బూ. రం. రావు

బాల్యవివాహ శాసనము పాడయిపోను! యిదేమిరోగమో!!
బాల్యమునందుగాక మరి భ్రష్టయినప్పుడు పెండ్లిజేతురా?
మూల్య మెఱింగి ఈ విధపు మోసములోబడిపోక, బుద్ధివై
శాల్యముచేత నీ విషమచర్చను పూర్తి పరిష్కరింపుడీ!

శివశివ! యెంతమాట!! యిది చెల్లునె? బ్రాహ్మణ ధర్మదూరులౌ
యవన తురుష్కపాలకుల యుండన నీ విధి నుండెగాని, హైం
దవుల స్వరాజ్యకాలమున ధర్మము సవ్యముగా వెలింగి కం
దువ వలె బర్వి బ్రాహ్మము నధోగతి ద్రోయక నిల్వలేదొకో?

ధర్మముమాట, మీ మనసు, దయ్యమెఱుంగును గాని చూడుడీ
కర్మము జాలిరాని కలకాలమునందున ఆడపిల్లకే
మర్మము దెల్యనప్పుడె సుమంగలిజేయ కుపేక్షచేసినన్
దుర్మదులైన పోకిరులు దోచుక పోదురు తథ్యమింతయే.

అది యట్లుండ; ప్రభుత్వమే యిపుడు మీ యంధత్వమున్ జూచి బా
ల్యదురాచార వివాహముల్ జరుగుచోట్లన్ తల్లిదండ్రాదులన్
అదరా! శిక్షకు పాత్రులౌనటుల జేయన్ జూచు చున్నారు ఎ
య్యది ఔచిత్యమొ యిప్పుడైన మది లక్ష్యంబుంచి చింతింపనౌ.

ప్రత్యక్షంబుగ హాని గల్గు మత ధర్మం బొప్పుకోనట్టి, సం
స్తుత్యంబైన ప్రభుత్వ మొల్లని, ప్రజా స్తోమంబు గర్హించు నీ
యత్యాచారము నాశ మౌనటుల సత్యార్థంబు వాదించి మీ
కృత్యంబు న్నెరవేర్చుడీ నిజమత క్షేమంకరాకారులై.'

# అంకితం

శ్రీ అంగర వేంకట సత్యనారాయణరావు

తనపాలిటి భాగ్యదేవతఅయిన సాధ్వీమణి ఋణం తీర్చుకోవడంకోసం కొండయ్య త్వరగా నడుస్తూ బజారులట్టు పోయేడు. అక్కడ ఒక గ్రంథమాలవారి కార్యాలయం గోచరించింది. కొంతసేపు గుమ్మంలో నిలబడి తదేకధ్యానంతో చూసి, లోపలికి ప్రవేశించేడు. ఎదురుగుండా కుర్చీలో ఒకాయన కనిపించేడు. ఆయన్ని సమీపించి, దీనంగా ఆయనతట్టు చూస్తూ నిలబడ్డాడు కొండయ్య. పనిలోఉన్న ఆయన ఒకసారి తలెత్తి కొండయ్యవైపు చూసేడు. కొండయ్య దీనదృక్కుల్ని ఆయన ప్రసన్నవదనం ఆహ్వానం చేసింది. కొండయ్య దీనంగా,

'అయ్యా! ప్రకాశకు లెక్కడుంటారు?'

'నేనే'

'చిత్తం!'

'ఏంపనిమీదొచ్చేరు?'

'తమ సహాయంకోరి'

'ఏం సహాయం? సరే చెప్పండి, నాకు సాధ్యమైనంతమట్టుకు...'

'చిత్తం'

'అయితే ఆ గ్రంథం ఏమిటి?'

కొండయ్య కళ్లంట నాలుగు కన్నీటిబొట్లు రాలేయి. ధైర్యం తెచ్చుకొని,

'నిరాశ!' అన్నాడు.

'నిరాశా?' అని ఆశ్చర్యంగా ప్రశ్నించేడు ప్రకాశకుడు.

కొండయ్యకి తల్లిదండ్రులు లేరు. అతని చిన్నప్పుడే చనిపోయారు. దిక్కులేక కొంచెం జ్ఞానం రాగానే భిక్షం ఎత్తుకుంటూండేవాడు. ఒకనాడు భిక్షం ఎత్తుకుంటూ ఒక యింటిముందు నిలబడి 'అమ్మా! భిక్షం పెట్టండి' అని దీనంగా కేకవేసేడు. యింతట్లో ఆ యింట్లోంచి ఒకసాధ్వి దోసెడుతో బియ్యం తెచ్చింది. భిక్షకుణ్ణి చూసింది. హృదయం కళుక్కుమంది ఆవిడకి. దోసెడుతో బియ్యం అలాగే పట్టుకొని కొంతసేపు నిలబడిపోయి 'అబ్బాయీ! యిలారా' అని లోపలికి పిలిచింది. జంకుతూ కొండయ్య లోపలికి వెళ్లేడు.

భిక్షకుణ్ణి ఆసాధ్వి ఒకచాపమీద కూర్చోబెట్టి అతనిపేరు, అతని తల్లిదండ్రులగురించి భోగట్టా చేసింది. అతని విషాదజీవిత చరిత్ర విన్నకన్నీరైపోయింది. వెంటనే అతని భిక్షాపాత్రిక లాక్కొని విసిరేసి 'కొండయ్యా! యింకదగ్గరనుంచీ నువ్వు యిక్కడేఉండు. నీకు భోజనానికి, బట్టకి లోటులేదు' అంది. కొండయ్య కొండెక్కిపోయాడు. కొండయ్యకు విద్యలేదని తెలుసుకొని అతనికి చదువు చెప్పించింది. అతనికి ఆమే తల్లి, ఆమే తండ్రి. కొంతమట్టుకు తల్లిదండ్రులులేని కొరత తీరింది.

కొండయ్య సహజంగా చాలా తెలివైనవాడు, చురుకైనవాడు. బాల్యావస్థలోనే అతనికి సంభవించిన దుర్భర దారిద్ర్యం అతని చురుకుతనాన్ని నిష్ఫలంగా కట్టిపెట్టింది. తల్లిదండ్రులిద్దరూ దివంగతులై పోగానే దిక్కులేక కూటికోసం భిక్షాపాత్రికచేత్తో ధరించేడు. కొన్ని సంవత్సరాలవరకు అతని భాగ్యరేఖ బైటపడలేదు. అతని సుగుణపుంజం లోకానికి తెరచాటైపోయింది. కాని అతను భిక్షాపాత్రికతో సహా ఆసాధ్వి గృహంముందు దీనంగా భిక్షవేడుకున్ననాడే అతని భాగ్యరేఖ బైటపడింది. ఆసాధ్వి అతని విశాల

ఫాలభాగంమీద తాండవిస్తూన్న సద్భావపుంజాన్ని గుర్తించి మహా ఉదార స్వభావంతో అతన్ని ఆహ్వానించి, శరణుయిచ్చింది.

కొండయ్య విద్యావంతుడయేడు. ఆసాధ్వి అంటే అతనికి మహాగౌరవం. తన శరీరం చెప్పులు కుట్టి యిచ్చినా ఆమె ఋణం తీరదన్న గట్టి నమ్మకం అతనికుంది. భిక్షుకుణ్ణి చేరదీసినందుకు సంఘం ఆమె పట్ల కొంత నీరసభావం వహించింది. కాని ఆమె దీనిని లక్ష్యం చెయ్యలేదు. ఆమె ఒక్కటే నిశ్చయించింది. కొండయ్య నిర్భాగ్యుడు, ప్రపంచజ్ఞానం పూర్తిగా సంపాదించని బాలుడు, పైగా తల్లిదండ్రుల్ని గోల్పోయేడు. దిక్కులేక కూటికోసం భిక్షాపాత్రిక పుచ్చుకున్నాడు. అంచేత అటువంటి దీనుణ్ణి, దిక్కులేని పక్షిని, రక్షించడంకన్న ధర్మం యింకొకటిలేదని విశ్వసించింది. అతనికి అభయహస్తం యిచ్చింది.

అలాంటి మహాసాధ్వి ఋణం ఏవిధంగా తీర్చుకోవడమో కొండయ్యకి తెలియలేదు. ఒకటే అతని విధ్యుక్తం! తన జీవితంలో సర్వదా ఆమెను తన హృదయంలో ప్రతిష్ఠచేసుకొని నిత్యం ఆమె పదపద్మాలను ఆరాధిస్తూండడం, ఆమె ఆజ్ఞ శిరసావహించడమే తన ముఖ్య కర్తవ్యం. విద్య పూర్తిచేసి అధిక శ్రమవల్ల పై ఊళ్లో ఒక ఉద్యోగం సంపాదించుకున్నాడు. ఆమెతో ఈ భోగట్టా చెప్పేసరికి ఆమె సంతోషం పట్టలేక పోయింది. అశ్రుపూరితలోచనాలతో కొండయ్య కొంతతడవు ఆమె ఎదుట మౌనంగా నిలబడి, చివరకి ఆమెవద్ద శెలవు పుచ్చుకొని వెళ్లిపోయేడు. ఉద్యోగంలో ప్రవేశించి జీవితం స్వతంత్రంగా గడుపుకొంటున్నాడు.

కొండయ్యకు సారస్వతసేవ అంటే మహాభిలాష. తన రచనలు పత్రికలమూలాన లోకానికి తెలియజేస్తూండేవాడు. తన నిర్భాగ్యజీవితంలో మృగ్యంగా ఉన్న భాగ్యరేఖలను ప్రస్ఫుటింపజేసి, తనపాలిటిపెన్నిధి అయిన ఆమహాసాధ్వి ఉదారస్వభావాన్ని పూర్తిగా మననంచేసుకొని, హృత్ఫలకంమీద చిత్రించుకొని, ఆ ఉత్తమాదర్శాల సహాయంతో మహిళల ఉదారస్వభావాలని తన రచనల మూలాన లోకానికి తెలియజేస్తూండేవాడు. దాతృత్వం, సహనం, దీనజనరక్షణ, సాహసం మొదలైన ఉత్తమగుణాలు మహిళల హృదయాంతరాళాల్లో అంకురించి, దీనజనపోషణకు ఏమాదిరిగా దోహదం అవుతాయో తెల్పేవిషయాలు తన రచనల మూలాన తెలియజేసేవాడు.

ఆమెను దర్శించి చాలకాల మైంది. కళ్లు కాయలుకాసిపోయేయి. ఒక్కనాడు శలవుపుచ్చుకొని ప్రయాణం అయేడు. ఆసాధ్వి-కాదు! తనమాతృదేవి గృహంచేరేడు. హృదయం పటేలున బద్దలైపోయింది, మరి అక్కడ నిలువలేక ఉత్తరక్షణంలో తనయిల్లుచేరుకున్నాడు.

తన భిక్షాపాత్రిక లాగుకొన్న ఆపవిత్ర హస్తాల్ని మరచిపోవడం ఎలాగా..? తనలో పొడసూపిన అభివృద్ధిని కనిపెట్టిన ఆప్రసన్న వదనాన్ని చూడకుండా ఉండడం ఎలాగా..? ముఖ్యంగా తనపాలిటి భాగ్యదేవత ఋణంతీర్చుకోవడం ఎలాగా..? పూర్తిగా సాధ్యంకాదు. ఒక్క పరమాణువు సమర్పించి ఆయినా..? తన ఆశలపంటకోసం అసువులు సమర్పించింది ఆ మహాసాధ్వి. ఆమె తెరచాటైపోగానే తన ఆశలు నిరాశలుగా కరుడుగట్టేయి. ఈవిషాదగాథ కొండయ్య హస్తాల్లో 'నిరాశ' అనే ఒక గ్రంథరూపందాల్చింది.

కొండయ్యకు సహాయంచేస్తానన్న గ్రంథమాల ప్రకాశకుడు గ్రంథమాల అభివృద్ధి సందర్భంలో ఆసాధ్వి వల్ల భూరివిరాళంపొందేడు. ఆయనతో కొండయ్య 'నిరాశ' అనే గ్రంథంగురించి సవిస్తరంగా చెబుతూ ఆగ్రంథాన్ని ఆమె పవిత్రాత్మకు 'అంకితం' యిస్తున్నానని చెప్పి, ప్రచురించమని కోరేడు. ప్రకాశకుడు ఈ అంకితాన్ని చూసి రెండుబాష్పబిందువులు రాల్చి గ్రంథాన్ని పుచ్చుకొని, శీఘ్రంప్రచురిస్తానని సవినయంగా కొండయ్యతో మనవిచేసేడు. కొండయ్య కొంత మనశ్శాంతిపొంది యింటికి మరలిపోయేడు.

---

# భూకంపం

శ్రీ
శివరాజు
వేంకటసుబ్బారావు
(బుచ్చిబాబు)

★

[తలుపు చప్పుడుకి ధైర్యంగా నిలబడి యెదిరించలేని ప్రేమ, భూకంపానికెల్లా తట్టుకుంటుంది? రహస్యప్రేమలో పరిపూర్ణత వుందని నమ్మొచ్చు. ఎందుకంటే, అది మనుష్యులను జీవించేటట్లు చెయ్యడమే కాకుండా, మరణించేటట్లు కూడా చెయ్యగలదు.]

★

5

దొంగిలించిన ముద్దులోవున్న మాధుర్యాన్ని పొగడడంలో అన్ని దేశాల కవులూ తన్మయత్వం అనుభవిస్తారు. అపహరించిన ప్రేమలో ఆనందం వుందని కళారాధకుల మతం. భార్య సొంత వొస్తువు కాబట్టి, వివాహం నెగ్గదని కొందరు సంఘ సంస్కర్తల అభిప్రాయం. రహస్యమైన అనుభవంకోసం, మానవుడు నీతిని గాలిపటంలా గాలిలో వొదిలి దారాన్ని తెంపుతాడు. పరాయి సొమ్మని పొందడంలో యెన్ని కష్టాలు, యెన్ని అంతరాయాలూ వుంటే, విజయానికంత విలువ వుంటుంది. ఈ వేటలోని వేడి చల్లారకుండా, ప్రియులు, అనేక కారణాలు కల్పించుకుని తాత్కాలికంగా, తాముచేసిన శాశ్వతమైన అపరాధాన్ని సమాధానపరుచుకుంటారు.

ఈ కథలోని ఇద్దరూ, ఆ సాయంత్రం దొడ్డివైపు గదిలో కలుసుగోడం అదప్పుడే పదోసారి. వారు సంవత్సరంలో పదిసార్లు కలుసుకోడానికి కారణం కాలం వేగంగా కదలకపోవడం అనుకుని కాలాన్ని నిందించుకుంటున్నారు. ఆ కొంప పురాతనపుది; ఆ గది మరీను. ఆ గదిలోని ముసిలి భోషాణం యెందరి తాతముత్తాతల ధనాన్ని దొంగల బారినుండి దాచిందో! మంచంపక్కన అమర్చబడ్డ సన్నగిలినదీపం యెప్పుడారిపోతుందా అని బోలెడు మెరుగు పురుగులు కాచుకున్నాయి. ఈ వ్యక్తులు కలుసుకున్నప్పుడు తప్ప, ఆ పురుగులు, వాటికి శత్రువైన ఆ దీపాన్ని చూడలేదు. లోపలికి వీచే, శరీరాన్నికరిచే గాలికి, దీపం చప్పుడుచేస్తూ ప్రాణం విడుస్తోంది. ఆమె, అతను, వారి రహస్యనాటకంలోని మొదటి రంగాలని మౌనంతో నటించారు.

'ఇప్పుడు నీ మొగుడు రాడుకదా!' అన్నాడతను.

'అప్పుడే యెక్కడొస్తారు? మొన్న నేగా వెళ్లింది!' ఆమె.

'వొస్తే ఏంజేస్తావు?'

'రాడంటే—నాకు తెలీదేమిటి?'

'ఓవేళ వొస్తాడే అనుకో, అప్పుడేంజేస్తావు?'

'ఫరవాలేదు.'

'ఓస్, కోత.'

'కాదు. నాకాభయం యెప్పుడో పోయింది.'

'నాదగ్గరేముందనీ, యిల్లా వొస్తావు?'

'అంతా వుంది. నువ్వు లేకపోతే నేబ్రతకను.'

'కోత. నే అసలు పుట్టకపోతే?'

'నేనూ పుట్టను. నువ్వు నాకోసమే పుట్టావు.'

'ఇది తప్పుకాదూ?' అన్నాడతను.

'తప్పేమిటి? ప్రేమ!'

'ప్రేమైతే, కలుసుకోడం యెందుకు? ప్రేమ మనస్సులో వుంచుకోరాదూ?'

'ఏమో నాకవేమీ తెలియవు. ఊరికే అంటావుకాని, నువ్విదిలేకుండా వుంటావా?'

'ఛా, నాకక్కర్లేదు.'

'ఓస్, కోత.'

ఇద్దరూ నవ్వుకున్నారు.

'నిజంగా వొస్తే యేమంటావు? మనం యిల్లా వుండగానే, నీమొగుడే వొచ్చిచూస్తాడనుకో'

'ఏమీ చెయ్యను.'

'అదికాదు చెప్పు. ఏమంటావ్? 'పో, పో', అంటావు నన్ను. . లేకపోతే బలవంతంచేశానని నామీద తోస్తావ్ నేరం. అంతేనా?'

'ఛ ఛ, చస్తే అల్లా చెయ్యను. మనకి ప్రేముందంటాను. అసలు నన్ను పుట్టించిన బ్రహ్మవొచ్చినా నిన్ను వొదల్ను.'

'అదిగో చప్పుడు' అన్నాడు పరిహాసంగా.

'లెక్కలేదు. వొదల్ను. ఇంకా గట్టిగా పట్టుకుంటాను.'

మళ్లా కొంత నిశ్శబ్దం. మెరుగు పురుగులు గదిలోకి జొరబడ్డాయి.

'దీనికేం, యెప్పుడూ వున్నదే కాని, నీ మొగుడే వొస్తే, మనం యిల్లావుండగా, యేమంటావు?'

'చెప్పాగా. ప్రేమంటాను. ఈ పట్టు విడిపించేందుకు యెవ్వడితరం? నేవొదల్ను నిన్ను, యెవరొచ్చినా సరే.'

'ఎప్పుడూనా?'

'నే చచ్చేవరకూ. భూకంపం జరిగినా, ఇద్దరం కలిసి చావాలిసిందే.'

'ప్రమాణం చెయ్యి.'

'పట్టు, చేస్తా.'

చేతిలో చెయ్యేసి ప్రమాణంచేసింది.

'నువ్వూ అంతే, తెలిసిందా?'

'నాకేం భయంలేదు, నేమొగాణ్ణి—నామీద యెవడికీ హక్కులేదు.'

'ఓస్, కోత.'

'ఛా, అల్లా అంటే నాకు కోపం వొస్తుంది.'

'లేదు, వూరికే అన్నా, ఆ చేతులిల్లా వెయ్యి.'

దీపం పూర్తిగా ఆరిపోయింది.

పావుగంట గడిచింది. ప్రకృతిలో జరుగుతున్న కల్లోలం, మనస్సుల్ని శరీరాలనుంచి విడదీసి మంటలో కలుపుకున్న ఆ యిద్దరు అమాయకపు వ్యక్తులూ గమనించే స్థితిలో లేరు. ఆకాశంలో గర్జనలు మారుమ్రోగి, గదిలోని ముసలి భోషాణాన్ని వొణికించాయి. చెట్లని పెల్లగించే గాలి, కిటికీని వూడగొట్టడానికి యెన్నోవిధాలు యత్నిస్తోంది. మెరుగు పురుగులు ఆగలేక దీపాన్ని పట్టుకుని ప్రాణాలని నిలబెట్టుకుంటున్నాయి. వీధిగుమ్మం తలుపు యెవరో తట్టినట్లు చప్పుడవడం మొదట్లో ఆమె వినగలిగింది.

'ఎందుకల్లా ఖంగారుపడతావు?' అన్నాడతను.

'ఏంలేదు. ఏదో చప్పుడైనట్లుంటేనూ...'

'ఐతే ఏం?'

'అబ్బే, ఏంలేదు.'

'అలుపొచ్చిందా?'

'కొంచెం, నీకు?'

'నాకులేదు. ఏదో చప్పుడు.'

'నా మొగుడు కాదుకద, కొంపతీసి!' అంది.

'నాకు లెక్కలేదన్నావుగా మరి! ఇంతేనా?'

'ఉండు. ఇప్పుడేమిటి వేళాకోళం. వొదులు, ఎవరో చూసివొస్తా.'

'వేళాకోళం యిప్పుడుకాక, యింకెప్పుడు?'

'భోషాణం వెనక దాక్కో, తలుపు తీసి చూసి వొస్తా.' అని మంచం మ్మీంచి లేచింది.

'ఇంతేనా ధైర్యం? ఇందాక కోతలు కోశావు!'

'అది వేరు.'

'వేరేమిటి, నీక్కావలిసింది జరిగిందిగా.'

'ఛ. నోరుముయ్ నీకక్కర్లేనట్లు, మహా.'

'నిన్ను నమ్మకూడదు.' అన్నాడు.

'నిన్నును... దాక్కో, వెళ్లిచూసొస్తా.'

'భోషాణం వెనక తేళ్లుంటాయి.'

'లేకపోతే, ఇందాకా వచ్చినట్లుగానే, నూతిగట్టుమీదనుంచి గోడ దూకు.'

'నే దూకను. నాకేం? భయంగా వుంటే నువ్వే దూకు. ఇందాకా చేసిన ప్రమాణం?'

'అది వేరు. ఇది నాయిల్లు. నువ్వుదూకు.'

'నీ యిల్లుకాదు. ప్రేమించినతర్వాత నాకూ యింటిమీద హక్కుంది.'

'కావాలంటే కోర్టులో చెప్పుకో, ముందు దూకు; లేకపోతే యెక్కడో దాక్కో.'

'నీవన్నీ లంజ టక్కులు.'

'నువ్వు మహా నీతిపరుడైనట్టు!'

'నే మొగాణ్ణి. నాకేం?'

'పోతావా పోవా?...'

అని, అతన్నిమంచం మీద నుంచి గెంటింది. గెంటి, ముసలిభోషాణం మీదికి తోసి, గదిబైటకి నడచి వీధిగుమ్మంలోకి వెళ్ళింది. అప్పుడు, క్వెట్టాని నాశనంచేస్తున్న భూకంపంలోని కొంత శక్తి, ఆ గదిని వూగిసలాడించింది. ఆమె నడుస్తూ, గోడమీద పడింది. మూడునిముసాలు ఆకొంప అదిరి వొణికి పోయింది. ముసలి భోషాణం కిందకి కూలి, విరిగి, అతన్ని దానికింద పడేసుకుని, కాపాడింది.

ఎంతోసేపటినుంచి తట్టుతున్నా తెరవబడని వీధి తలుపు వూడిపడింది. బైట వేచివున్న ఆమెభర్త ఒక్కవూపున లోపలికి పడి, గోడమీద పడిన భార్యని కలుసుకొన్నాడు.

'దెబ్బ తగల్లేదుకద?' అన్నాడు భర్త.

'లేదు, లేదు. మీకు?'

'నాకులేదు. దొడ్డివైపు కప్పు కూలినట్టుంది. చూద్దాం పద'

ఇద్దరూ వెళ్ళి గదులన్నీ పరకాయించారు. భోషాణం గదిలోకి ప్రవేశించారు. కిందనించి రక్తం కారుతోంది. మనిషి మూలుగు, రొద వినిపిస్తున్నాయి. భర్త, విరిగిన భాగాలను తొలగించి, అతన్ని బైటికి తీశాడు.

'వీడెల్లా వొచ్చాడిక్కడికి?'

'మీ బంధువే. మహానుభావుడు. వొచ్చి, నానాగొడవా చేశాడు. పర స్త్రీని బలవంతంచేసిన వెధవకి అల్లాగే అవుతుంది.'

'పాపం, చావడుగద!'

'ఇట్లాంటివాళ్లు చస్తే, పీడ వొదుల్తుంది. అందుకనే అప్పుడప్పుడు భూకంపాలు!'



కాకినాడ శ్రీ విద్యార్థినీ సమాజము : సభాధ్యక్షురాలు శ్రీమతి కమలా సత్యనాథన్, ఎమ్. ఎ.



మహిళా విద్యాలయ బాలికలు ప్రదర్శించిన సంస్కృత
శాకుంతల నాటకములో పాల్గొన్న కొందరు.




## కేశములు

కొబ్బరినూనె, నువ్వులనూనె, ఆముదము, ఇవి మూడును వెంద్రుకలకు మంచి యాహారము. వెంద్రుకలను ప్రతిదినము మంచి దువ్వెనతో సాపుగా మొదటినుండి చివరవరకు సాగునట్లు దువ్వి వాటికి పరిశ్రమ నివ్వవలెను. అట్లు చేయుటచే వెంద్రుకలు సన్నబారును. బాగుగా పెరుగును. అనంతరము కేశపాశము నేవిధముగనైన వేసికొననగును. బాగుగా దువ్వినతలపై ప్రతిదినము సిల్కు చేతిరుమాలుతో క్రిందికి రుద్దినచో వెంద్రుకలకు మృదుత్వము కాంతి యేర్పడును. పుష్పములు సూర్యరశ్మి నెట్లు యాహ్వానించునో అట్లే వెంద్రుకలను సూర్యరశ్మియందుండుట కుత్సహించును. అందుచే యభ్యంగనమయిన తర్వాత తల విరియబోసుకొని ఎండలో కూర్చొనుట మంచిది. బిగువుగా కేశపాశము ధరించువారు రాత్రులందు దానిని సడలించిగాని పూర్తిగావిప్పిగాని నిద్రింపకుండినచో కేశములకు హానిచేసినవారగుదురు. ప్రకృతిచే యొసగబడిన చమురు వెంద్రుకలకు నడిమి వయస్సునుండి కావలసినంతయుండదు. ఆలివునూనె నప్పుడప్పుడు వెంద్రుకలకు ఆ వయసునందు రుద్దుటచే మంచి గుణమిచ్చును.

తలను సోడాతో రుద్దుటకంటె బోరక్సుగాని బోరక్సుకలసిన సబ్బుతోగాని రుద్దుట మంచిది. సోడాయును, కుంకుడుకాయలును వెంద్రుకలకు బిరుసుదనము చేకూర్చును. సీకాయతో రుద్దుకొనిన వెంద్రుకలకు మృదుత్వ మేర్పడును. మందారపూలు, ఆకులనుకోసి రుబ్బుగోటిలోరుబ్బి ఆరసము పిప్పి అంతయు బాగుగా వడియగట్టిగాని ఆరీతినేగాని తలకురుద్దిస్నానముచేసినచో మురికి వదలును, వెంద్రుకలకు మృదుత్వము చేకూరును. అవి బాగుగా పెరుగును, నల్లబడును. దీనివలన కలుగు సుగుణములు మిక్కిలి ఖరీదయిన లోషనులవలన కూడ కలుగవు. వెంద్రుకలు చివర చిట్లిపోయినచో నెదుగనేరవు. కనుక అట్టి దుస్థితి యేర్పడకుండ తగు జాగరూకత తీసికొనవలెను. ఎమ్మోనియాగడ్డ నొక తులము తీసికొని దానిపై నొక శేరు మరుగుచున్న నీళ్లుపోయుము. చేయి భరించునంతటి వేడిమివరకు చల్లారిన తర్వాత యీ నీటిని బాగుగ నురుగువచ్చునట్లు తరచుము. ఈ నురుగును వెంద్రుకల మొదళ్లకును, వెంద్రుకలకును రుద్ది చన్నీటితో కడిగివేయుము. దీనివలన పగిలిన వెంద్రుకలు బాగుపడుటయేగాక యనేక యితర సుగుణములును కలుగును.

స్నానమయిన తర్వాత వెంద్రుకలారిపోయి కళావిహీనమై యుండును. అప్పుడీ తలనూనె యుపయోగించుట మంచిది. 2 తులముల కొబ్బెరనూనెగాని, నువ్వులనూనెగాని, ఆముదముగాని ఒక

సీసాలో పోయుము. అందు రెండు తులముల గ్లిసరిను, ఒక అరతులము ఆల్కహాలుపోసి బాగుగా కలియు నట్లు సీసాను అటునిటు ఆడించుము. ఆనూనెను వెంద్రుకల మొదళ్లకు వ్రేళ్ల కొనలతో కొంచముగా రుద్దుము.

వెంద్రుకలు చిన్నవయస్సునందే తెల్లబడకుండ యాపుట కొంతవరకు సాధ్యము. ఒక గరిటెడు ఆల్కహాలును మరొకగరిటెడు చిక్కగా నల్లగాయుండు టీ కషాయమును ఒక పాత్రలోపోసి అందుకొంచము ఉప్పుచేర్చి ఆ ద్రవమును తలకు రుద్దుము. ఇది వెంద్రుకలకు బలమునిచ్చి నెరయుటనాపును.

నెరసిన వెంద్రుకలందముగా నుండుటను కొంచము నీలిమందుకలిపిన నీటితో స్నానముచేయనగును.

వెంద్రుకలు రాలిపోకుండుట కీ నూనె రుద్దిన లాభించును. 8 ఔన్సుల ఆల్కహాలు, ½ ఔన్సు గ్లిసరీను, ½ ఔన్సు వెండరు 8 గ్రెయినుల క్వినయినుసల్ఫేటు బాగుగా నొకసీసాలోకలిపి సువాసనకై యేదేని కొంచ మత్తరు చేర్చనగును.

వెంద్రుకలు రాలిపోవుటయునుగాక, బట్ట తలయునుగాక ఒక్కొకచోట వెంద్రుకలు బొత్తిగా లేక చర్మ మగుపడును. దానిని పేను తినినదందురు. ఆ స్థలమందు మందారపూలను రసమినుకునట్లు మర్దన చేసినచో గుణమిచ్చును.

బట్టతల కాకుండజేయుట కెన్నియో తలనూనెలు బజారునం దమ్ముడుపోవుచున్నవి. సంతుష్టి కరమగు గుణమిచ్చుటకును, చెడుపదార్థములు కలిగియుండకుండుటకును, సులభముగ యింట తయారుచేసి కొనుటకును ఈ దిగువ చెప్పబడిన నూనెను మించినదేదియునులేదు. కోడిగ్రుడ్డులోని పచ్చని పదార్థమును పురికొడు నీరుల్లిరసముతో కలుపుము. ఈరెంటి యంతటి కాడ్లివరాయిలు దానికిచేర్చి 10 నిముషములు బాగుగా యీ మూడింటిని కలుపుము. ఇందుగల దుర్వాసనను కప్పిపుచ్చుటకేదేని యత్తరు నిందుచేర్చి యొకసీసాలో నింపుము. దీనిని ప్రతిదినము వెంద్రుకల కుదుళ్లకు రుద్దిన గుణమిచ్చును. కాని స్వతస్సిద్ధముగ వెంద్రుకల కుదుళ్లు రూపు మాసిపోయినచో ఈమందు గుణమీయదు. ఇదేకాదు, ఏ మందువలనకూడ లాభములేదు.

వెంద్రుకలు కెరటములవలె వంకరలుకలిగి యుండగోరినచో బ్రిలియంటైను, వేసలైనులు యితర నూనెలకంటే గుణదాయకములు. వెంద్రుకలకీ వంకరలు కలుగజేయుటకు ఎలెక్ట్రిక్ సాధనములుగలవు. పట్ట ణములలోగల స్త్రీల కేశపోషణాలయములలో వీటి సహాయము పొందనగును.

## ము ఖ ము

ముఖమునకు కొంచమురాపిడి తగులుట మంచిది. సున్నిపిండిగాని, సబ్బుగాని బాగుగా రుద్దుటచే యీరాపిడి యేర్పడును. ఈ రాపిడివలన చర్మమునకు పటుత్వమేర్పడి అందమునిచ్చును. శరీరమందలి యితర యవయవములన్నిటికంటె ముఖమందలి చర్మము శీతోష్ణస్థితులకు హెచ్చుమార్పు జెందును. అందుచే శీత కాలమందప్పు డప్పుడు ముఖమునకు ఆవిరిస్నాన మిచ్చుట మంచిది. ఇందువలన చర్మము మృదుత్వము చెందును.

తగుశ్రద్ధతీసికొనినచో ముడుతలవలన గలుగుయనర్థము తగ్గించవచ్చును. కొన్ని ముడుతలను మాత్రము పూర్తిగా నిర్మూలింపవచ్చును. మధ్యవయస్సులో యీ ముడుతలు నొసటిపై చూపట్టును. కనుబొమలను పైకెత్తిగాని ముకుళించిగాని మాట్లాడు యలవాటును మానుకొనవలయును. ప్రతి సామాన్య విషయమునకును నవ్వుటగాని, యేడ్చుటగాని ముడుతలను పెంపొందించును. కన్నీరు హృదయమునుకడిగి ప్రకాశవంతముగ జేసినను, ముఖకాంతిని పోగొట్టును. ఉప్పగనుండు కన్నీరుగాని చెమటగాని జాగ్రత్తగా ముఖమునుండి తుడిచి వేయవలెను. విశ్రమించుటకుముందు శుభ్రమయిన సబ్బుతో వేడినీట ముఖమును కడిగికొనుట మంచిది. నొసలునకు మధ్యగా రెండు కనుబొమల మధ్యభాగమునకు పైన, రెండుచేతుల వ్రేళ్లను, కొనల వెనుకభాగ మొకచేతిది రెండవచేతికి తగులునట్లు ఉంచుము. ఆ వ్రేళ్ళనప్పుడు నొసటిపైనదిమి చెవులవరకును జారనీయుము. ఇట్లు 10 నిమిషములుచేయుము. అనంతరము కనులకొనలన వ్రేళ్లను గుండ్రముగా యదిమిత్రిప్పుము. చర్మము ముడుతలతో యున్న నొకచేతితోసాగదీసి, మరొకచేతితో పైవిధముగా మర్దనచేయుము. ముక్కునకుచేరి దవడపై కొకముడుత యున్నదనుము. ఒకచేతితో యచటిచర్మమును బాగుగ బిగియబట్టి ఆ ముడుతపై యడ్డముగ యటునిటు నొక్కి వ్రేళ్లకొనలతో రాయుము. అప్పుడొత్తిడి ముఖ్యముగా కంటివైపుగాని, చెవిపై భాగమునకుగాని యుండనిమ్ము. తరువాత తక్కువ యొత్తిడితో గుండ్రముగా మర్దనచేయుము. మర్దన యెల్లప్పుడును దూరముగ గొనిపోవునట్లును, గుండ్రముగా సున్నలు చుట్టినట్లును ఉండవలెను. ఎన్నడును క్రిందికి చేయరాదు. సున్నితముగా హెచ్చుకాలము చేయుటవలన లాభముగాని ఎక్కువ ఒత్తిడిచే అనర్థముకూడ కలుగును. మర్దనచేయునప్పుడు వ్రేలికొనలకు ఉప్పునీటిని గాని, లేదా ఆలివునూనెనుగాని నిమిరి మర్దన చేయుటచే విశేషలాభదాయకము. మర్దనఅయిన తక్షణము ఉప్పునీటిని ముఖమునుండి సబ్బుతో కడిగివేయవలెను. చర్మమునకు బలమునిచ్చు పదార్థములు చేర్చబడిన పౌడరును మర్దన యనంతరము ముఖమున కద్దుట మంచిది. ఈ పౌడరును రాత్రికాలమందు శుభ్రముగా కడిగి మరియు నిద్రించవలెను.

ముఖమునకు తిలకము మోటని యీనాటి కొందరి నాగరికవనితల యుద్దేశ్యము. సౌందర్యమునకు పేరెక్కిన వెనిస్, రోమువనితలు పూర్వము ముఖమున కందమిచ్చుటకు దవడలపైననో, కంటికి క్రింది భాగముననో, నల్లనిచుక్కల నొకటికిమించికూడ పెట్టుకొనెడివారు. తెల్లనిశరీరముపై నల్లనిచుక్క లాకర్షణీయముగాయుండి చూపరులదృష్టి నరికట్టును. హిందూ సుందరులీ యుద్దేశ్యముతోనే నొసటిమధ్య తిలకము ధరించుచున్నారు. పచ్చటి శరీరకాంతిగలవారికి నలుపు, నీలి, ఊదారంగుల తిలకమును, చామనచాయగనున్నవారికి కుంకుమబొట్టును యందమిచ్చును.

గననొసలు, విశాలముగనున్నదో, మూలలుదేరి యున్నదో, చూచి దానికి తగునట్లు మధ్యపాపిడిగాని ప్రక్కపాపిడిగాని తీసికొనిన యందముచెడకుండును. ఈ నొసటి యాకృతి కనుగుణముగా కేశములు దిద్దుకొన నగునుగాని యితరుల ననుకరించబోయి ఉన్నయందమును చెడగొట్టుకొనుట తగదు.

(సశేషము)

—శ్రీ అలంపురం రాజు, బి. ఏ.

# లలనా!

౧

లలనా! ఓ లలనా!!
మలిన మనస్కులు
పురుషులు నిను
పురాతనములో
అజ్ఞానావృత
అపథాల్లోపల
అడుగిడ జేసిరి
లలనా! ఓ లలనా!!
ఇకనైనను, మేలుకాంచుము!

౨

హరించి మెల్లగ నీ
ఆర్థిక బలమును,
అబలను జేసీ ని-
న్నణచి వైచిరి,
అబలా! 'అబలా'
యనునది యొక బిరు
దను కొంటివా!
అణచి యుంచుట
కదియొక యెత్తే!
ఆర్థిక బలమే
అన్నిట బలమని
తెలిసికొని యో
లలనా! ఓ లలనా!!
ఇకనైనను మేలుకాంచుము!

3

ఒకరోజున స్త్రీయే
సంఘమంతకు మేస్త్రీయై
ఒప్పియుండగ నేడో?
'స్త్రీ' యన నొక
జీవచ్ఛవమే గాదా?
లలనా! ఓ లలనా!!
ఇకనైనను మేలుకాంచుము!

౪

లలనా! ఓ లలనా!!
'గృహలక్ష్మి' వి నీవని
క్రూర హృదయులు
పురుషులు నిను
గుహలవంటి
గృహాల లోపల
ఘూర్ణిల జేయగ
మోహంబేలా?
మొగమోటంబేలా?,
లలనా! ఓ లలనా!!
ఇకనైనను మేలుకాంచుము!!

—కొత్తపల్లి రంగారావు.



బొంబాయి ఆంధ్రమహిళాసభ మూడవ వార్షిక సమావేశ ఛాయాచిత్రము. ఈ సభలో 40 మంది సభ్యులుగలరు.
కార్యదర్శి శ్రీమతి ప్రభల అన్నపూర్ణమ్మగారు.



బొంబాయి ఆంధ్రమహిళాసభ
ఆటల పోటీలయందు గెలుపొందినవారు.

# మేనరిక వివాహాలు కూడునా?

## శ్రీ డి. కె. ప్రసాద్

నేటి నవనాగరికతా కుటుంబాల్లోకూడా పిల్లల పెళ్ళిళ్ళమాట తలపెట్టేసరికి ట [illegible] ంమాట జ్ఞప్తికి వస్తుంది. అంతేకాదు. అనాదిగా ఆచరణలో ఉన్నాయి, ఉంటున్నాయి. "మేనరికం చేసుకున్నాం" అని పెద్దవాళ్ల సంతోషమేకాని, దానివల్ల ఎంతమంది కాబోయే పెద్దవాళ్ల జీవితాలు నాశనం అవుతున్నాయో కొంచమైనా యోచించడంలేదు. నాగరికత, స్వేచ్ఛాజీవితం అలవడిన యీ రోజుల్లోకూడా యిట్టి దురాచారాలకి తావీయడం చాలా శోచనీయాంశం.

అన్నాచెల్లెళ్ల పిల్లలకుకాని, అక్కాతమ్ముళ్ల పిల్లలకుకాని లేక యిలాంటి అర్థశూన్యమైన వావి వరుసలు కల్పింపబడిన పిల్లలకుకాని పెళ్లి చేయడం మేనరికమని అందరకూ తెలిసినదే. ఇంతేకాదు, యువకుడు తన సోదరి కుమార్తెనుకూడా వివాహమాడ వచ్చునట. ఆ యువకునకే తన సోదరుని కుమార్తె తనకుకూడా కుమార్తెవరుసయైనపుడు, సోదరి కుమార్తె తన కుమార్తె ఏల కాదు? సోదరీసోదరుల బిడ్డలు సోదరులేల కాకూడదు? పరరక్తము యీ రెండు విషయాల్లోను కలుస్తోంది కదా!

మొదట్లో వివాహముకాని మహానుభావులు ఇట్టి సంబంధాలు కల్పించి, తమ వివాహార్హతను ధృవపరచుకొన్నారు. అది తమ హక్కుని పశుబలాన్ని చూపించారు. కాని యీ మేనరికాన్ని సృష్టించిన ప్రబుద్ధులే వధూవరుల గోత్రం ఒకటి కాకూడదను షరతెందుకు పెట్టారో? దానికి నాకు తట్టిన కారణాన్ని సూచిస్తాను. అసలు యీ నా వ్యాసానికి శాస్త్రాలు మొదలైన ప్రాచీన గ్రంథాలు ఆధారాలుకావు. ఇప్పుడు లోకంలో జరుగుతున్న ప్రత్యక్ష ఆచారమే ఆధారము. ఈ వ్యాసము చదువుతున్నంతసేపు యీ విషయం మరచిపోవద్దని నా మనవి.

స్త్రీకి వివాహమవగానే, ప్రాచీన సాంప్రదాయాన్ననుసరించి భర్తగోత్రం అమల్లోకి వస్తుంది. అందుచేత తన (అంటే వివాహముకాని ఘోటక బ్రహ్మచారి) గోత్రము, తన మేనకోడలి లేక మేనమరదలి గోత్రం ఒకటియగుటకు వీలుండదు. ఈ రహస్యాన్ని గ్రహించే యీ షరతును నిర్ణయించారు. ఈ కారణం చేత, కన్యను సగోత్రీకుడైన పైవాడు తన్నుకుపోవడానికి వీల్లేదుకదాయని వీళ్ల ధైర్యం. యీ అల్పసంతుష్టిది స్వార్థపరత్వం కాదా?

ఆదిలో, యీ ఆచారం అమల్లోకి రావడానికి యింకో కారణంకూడా నా అల్పమస్తిష్కానికి తట్టుతోంది. ఐకమత్యంలేని మన పూర్వులకాలంలో, గ్రామాల్ని రక్షించుకోడానికి సంఘబలంతప్ప యితర ఆధారాలు అంతగాలేవు. అందుకై, మేనరికంలాంటి బీరకాయపీచు సంబంధాల్ని కల్పించి, తమవాడు పైకి పోకుండా చూచేవారు. ఇందుకు, అవిభక్తసంపద అయితే, అందరూ ఉమ్మడిగా వాడుకోవచ్చునన్న దురాశ తోడైంది. తమవానికి పిల్లనిస్తే, తమ చెప్పుచేతల్లో ఉంటాడని మరో భ్రాంతి. వధూవరులకు అరణంగా యిచ్చిన ధన ధాన్యాదులు పైకిపోకుండా తమలోనే యుంటాయని మరో చిన్న కారణం. ఇదంతా స్వార్థంతో కూడి ఉంది.

ఈ ఆచారాన్నే యిప్పటివారు 'గుడ్డెద్దు చేల్లోపడినట్లు' అనుకరిస్తున్నారు. ఈ ఆచార పరులే ... ల పిల్లలకు పెళ్లిళ్లుచేస్తారని యితర జాతులను ఆక్షేపించబోతారు. గురువెందగింజ తన నల్ల...

వృద్ధులకంటికి "వివాహం" అనే మాటకు, 'ధనము, బాంధవ్యము, సంతానాభివృద్ధి' అన్న అర్థాలేతప్ప, యింకేవీ గోచరించవు కాబోలు! వీరిలో 'ప్రేమ' అంటె యేమిటో తెలియనివారున్నారంటే కోతగాదనుకుంటాను. వీళ్ళ ఉద్దేశ్యంలో భార్యాభర్తలు సంసారం చెయ్యడమంటే, తమపొట్టలు నింపుకుంటూ, అవసరమైనప్పుడల్లా పశువాంఛను తీర్చుకుంటూ, అందుకు ఫలితంగా దుర్బల సంతానాన్ని కని పారెయ్యడం. ఈ వృత్తిని ఎంత తొందరగా ప్రారంభిస్తే, అంత ఎక్కువగా ఆ పెద్దఘటాలు సంతోషిస్తాయి. దీనినే ప్రధానవృత్తిగా పెట్టుకున్నవారు 'సంతాన పంటభూము' లనిపించుకొంటారు కాని, భార్యాభర్త లనిపించుకోరు. ఇట్టివారి విషయంలో, వివాహం సుఖసంతోషాలమయంగా నుండవలసినదానికి బదులు దుఃఖదారిద్ర్యాల మయంగా పరిణమిస్తోంది. 'తాచెడ్డకోతి వనమెల్ల చెరచింద'న్నట్లు ఈ ఉపదేశాలనే తమ సంతతకికూడా చేస్తున్నారు. మేనరిక వివాహాలకు బలి అయిన జననీజనకులు యెంత సుఖపడుతున్నారో తమ వంశాంకురాలుకూడా అంతే అనుభవించాలని కోరుతున్నారు. దీనిని అసూయ అనుకోవాలో, మూర్ఖత అనుకోవాలో తెలియడంలేదు.

చిన్నప్పటినుండి ఒకే కుటుంబంలో పెరిగి, అన్నా చెల్లెళ్ళవలె ప్రవర్తిస్తోన్న పిల్లలు, పవిత్ర వివాహసూత్రంచేత కట్టబడి, ప్రాయంవచ్చేసరికి తప్పనిసరిగా భార్యాభర్తలవలె ప్రవర్తింపవలసివస్తోంది. ప్రేమలేని పెళ్లి నేతిబీరకాయవంటి దని అనుభవం ఉన్నవారికే తెలుసును.

కాని, కొన్నిచోట్ల (అవి చాల తక్కువలెండి). ఈ మేనరిక వివాహసర్పాలు పూలమాలలవుతున్నాయి. అంటే సుఖవంతంగా ఉంటున్నాయన్నమాట. పెద్దల స్వార్థంకోసం చేసిన వివాహాలు, వధూవరుల అదృష్టంవల్ల అనుకూలదాంపత్యం ఏర్పడుతోంది. ఆ దంపతులు అదృష్టవంతులు. వారికి నా ధన్యవాదాలు. కాని, అది 'లాటరీ పెళ్ళి' అన్నమాట మరచిపోవద్దు. ఈ లాటరీనే మళ్లీ ఎవరిపేరనైనా వేస్తారేమో! ఫలితం వ్యతిరేకం కావచ్చును. లోకాన్నిబట్టి ఇలా అనవలసివచ్చింది.

ఈ వివాహాల విషయంలో వధూవరుల బాధ్యతకూడా కొంతవరకున్నది. పెద్దలమాట ధిక్కరించకూడదను నమ్మకముతోనైతేనేమి, తనను చిన్నప్పటినుంచి పెంచి, పెద్దవానిగా చేశారని కృతజ్ఞతతోనైతేనేమి, తమ జీవితాలను యీ ప్రణయులపాలిటి నిర్జీవ ఘోరపిశాచాలకి బలియిస్తున్నారు. తరువాత ఫలితమనుభవిస్తున్నారు. అట్టిదానికి యితరులను నిందించడమెందుకు? ఆజన్మాంతము విచారించడమెందుకు? వివాహమాడిన కన్యతో సంసారము చేయవలసినవాడు తానుకాని, పెద్దలు కారుకదా!

పెద్దలమాట ధిక్కరించకూడదన్నమాట మంచిదే కావచ్చును కాని, అదెంతవరకు? తన మంచి కోరినంతవరకు. హద్దుమీరి స్వార్థముతో కూడినదైతే, 'కుక్కకాటుకు చెప్పుదెబ్బ'గా తన మంచి తాను చూచుకోవలసినదే. ఎక్కడైనా తనకుమాలిన ధర్మమా?

## మేనరిక వివాహాలు కూడునా ?

ఇట్టి అయిష్ట వివాహాలు నిరాటంకంగా కొనసాగడానికి బాల్యవివాహాలు కొంతవరకు (చాలవరకే అండి) సాయపడుతున్నాయి. ప్రేమతత్వాన్ని కాని, బంధువుల (ముఖ్యమైనవాళ్లే) స్వార్థపరత్వాన్ని కాని గుర్తింపగలిగిన జ్ఞానం కలగకుండానే, ధనానికాశపడో, బాంధవ్యాన్ని విడకొట్టుకోలేకనో, ముసలమ్మల పోరుపడలేకనో, లేక 'మొక్కై వంగనిది మానై వంగునా?' అన్న భయంచేతనో, మొదలువిరిచి మేనరికాన్ని అంటగడుతున్నారు. వయసువచ్చినపిమ్మట వధూవరుల కిష్టమైతే సరే సరి. లేకపోతే, దానిఫలితం మహాభయంకరంగా పరిణమిస్తుంది. అందుండి పుట్టేవి మొదటిది సంసార విచ్ఛిన్నాలు. తరువాత బంధు విరోధం, కోర్టు కేసులు.

ఈ మూఢాచారాలే వంశ పారంపర్యా వస్తున్నాయి, 'సిరి అబ్బక పోయినా చిడుం అబ్బింది' అన్నట్లు. పూర్వులు యిలాంటి పనులు అవసరం కలిగో తప్పని సరిఅయో చేశారంటే కొంత వరకు ఒప్పుకోవచ్చును. కాని, ఈ ఇరవయ్యో శతాబ్దములో వైద్య శాస్త్రం నిషేధించినా, యువతీ యువకులు తిరస్కరించినా, నయాన్నో, భయాన్నో ఈ మేనరికాన్ని ముడెడు తున్నారు. మనంచేసే ప్రతి పని స్వార్థంతో నిండి ఉన్నా, దానికి కూడ అంతుంది. తమ సంతోష సౌఖ్యాల కోసం యితరుల జీవితాలని బలి యిమ్మనడం సహింప రానిది. దానిని యువతీ యువకులు అరికట్టాలి. నిషేధించాలి. ఈ మూఢాచారాలే అకాల మరణాలకి కారణం అవుతున్నాయి అంటే అబద్ధంకాదు.

ఇప్పటివాళ్లేమైనా ఈ విషయంలో ఎదుర్కొంటే, 'వేదశాస్త్రాలలో యిలా చెయ్యమని వ్రాసి వుంది' అని ఉపన్యాసం ప్రారంభిస్తారు. ఈ వేదశాస్త్రాలు వ్రాసిన పండితోత్తములెవరో, ఏ శతమువారో అప్పటి సాంఘిక, కాలమాన పరిస్థితు లెట్లుండేవో కాస్త వెనక్కి తిరిగి చూస్తే బోధ పడుతుంది. మనం చేసే పనుల్లో స్వార్థ పరత్వం ఎన్నిపాళ్లో? స్వార్థత్యాగం ఎన్నిపాళ్లో?

ఏమైతేనేం! ఏ మహనీయుడు ఏ ముహూర్తాన్ని యీ ఆచారాన్ని దేశంలోకి వదిలాడో కాని, యీ నాడు కూడా అది నిరాటంకంగా, మహామారివలె, పల్లె పల్లెలా, వాడ వాడలా వ్యాపించి, ప్రణయ గంధంతో కూడిన ప్రేమైకజీవితకుసుమాల్ని నిర్దాక్షిణ్యంగా నలిపి పారవేస్తుంది. ఇప్పుడైనా మించి పోయిందేమి లేదు. చికిత్సా విధానం సులభమైంది ఒకటుంది.

యువతీ యువకులు ఒకరి నొకరు వరించుకొన్నా, లేక మేనరికాన్ని తిరస్కరించినా, నిజంగా తల్లిదండ్రులు లేక సంరక్షకులు, వాళ్ల సుఖాన్ని కోరినట్లయితే, బలవంతం చేయకూడదు. పట్టుదలకోసం చేశారా, ఫలితం అనుభవిస్తారు. ఒకవేళ పెద్ద వాళ్ళకు ఈ విషయం తోచనప్పుడు ప్రేమించుకొన్న యువతీ యువకులు (ప్రాయం వచ్చినవారే కదు!) తమ మంచి తాము చూచుకోవాలి. పెద్దలకు నచ్చ చెప్పాలి. తొందరపడి ఏ పనీ చెయ్యకూడదు. 'సహసా విదధీత న క్రియాం' అన్నారు అనుభవజ్ఞులు.



# బాలభాగ్యం

పిన్ని ఉత్తరాలు

## సంయుక్తరాష్ట్రాలు-౨

సర్వమంగళా,

నువ్వు కృష్ణలీలలు సినిమా చూశావు కదూ. ఆ కథ అంతా జరిగినచోటు ఏ ప్రాంతంలో ఉందో తెలుసా? సంయుక్తరాష్ట్రాలలోనే. కృష్ణుడు నివసించిన మథురాపురి, అతడు తిరిగిన బృందావనం ఇవన్నీ ఇప్పుడు రైల్లోవెళ్లి చూడవచ్చు. హిందువులంతా బృందావనం చూసివస్తే పుణ్యమని యాత్రకు వెడతారు. ఈ బృందావనంలో ఓ గొప్ప దేవాలయం ఉంది. ఇరవై ఐదు లక్షల రూపాయిలయిందిట ఈ గుడి కట్టించ డానికి!

మథురాపురికి సుమారు తొంభైమైళ్ల దూరంలో ఢిల్లీ ఉంది. ఈ ప్రాంతంలోనే పురాణాలలో మనం చదువుకున్న పాండవుల ఇంద్రప్రస్థపురము ఉండేది. ఈ ప్రాంతం పూర్వంనుంచీ ప్రసిద్ధికెక్కినదే. ఎన్నో రాజ్యాలు ప్రబలి నశించిపోయాయి ఇక్కడ. ఎన్నో యుద్ధాలు జరిగి, ఈ భూమి అంతా యోధుల రక్తంతో నిండింది.

ఢిల్లీలో ఒకప్పుడు పృథ్వీరాజు అనే గొప్పవీరుడు రాజ్యంచేశాడు. ఆ కాలంలోనే ఆ సమీపంలో ఉన్న కనూజ్ అనే ప్రాంతాన్ని పాలిస్తూ జయచంద్రుడనే మరోరాజుండేవాడు. పృథ్వీరాజుకీ జయచంద్రుడికీ విరోధంగా ఉండేది. దానికితోడు ఏమి జరిగిందంటే, జయచంద్రుడి కూతురైన సంయుక్త 'పృథ్వీరాజుని పెండ్లిచేసుకుంటా'నంది. తండ్రి 'వద్ద'న్నాడు. స్వయంవరం చాటించి, పృథ్వీరాజును తప్ప అందరినీ పిలిచాడు. పృథ్వీరాజును అవమానించడంకోసమని అతడిలాంటి బొమ్మను ఒకటి చేయించి, ద్వారపాలకుని మల్లే గుమ్మందగ్గర పెట్టించాడు. సంయుక్త ఏంచేసిందో తెలుసా? పూలమాల తీసుకొచ్చి ఆ బొమ్మ మెడలో వేసింది! పృథ్వీరాజు ఆ సమీపంలోనే పొంచి ఉన్నాడు. సంయుక్త తన్ను ప్రేమించిందని తెలుసు గనక, ఆమెను తీసుకుపోడానికి గుఱ్ఱంతో ఆవేళకు వచ్చి సిద్ధంగా అక్కడ ఉన్నాడు. ఆమె ఆ బొమ్మ మెడలో పూలమాల వెయ్యడంతోటే, ఆమెను పృథ్వీరాజు గుఱ్ఱంమీద ఎక్కించుకుని ఎవళ్లకీ అందకుండా దౌడు తీశాడు.

జయచంద్రునికీ, పృథ్వీరాజుకీ వచ్చిన వైరమే మన భారతదేశం ఇతరదేశస్థులకు వశం అవడానికి కారణం. పృథ్వీరాజును ఎలాగైనా ఓడించాలన్న పట్టుదలతో, దేశద్రోహం అని వెనుదియ్యక, జయచంద్రుడు మహమ్మదు గోరీ అనే పరాయిదేశపు సుల్తానును సైన్యంతో మనదేశానికి రప్పించాడు. వాళ్లిద్దరూ జేరి పృథ్వీరాజుమీదకు యుద్ధానికెళ్లేరు. మొదట పృథ్వీరాజే నెగ్గేడు. దరిమిలాని అతడు ఓడిపోవలసి వచ్చింది. తర్వాత మహమ్మదు గోరీ జయచంద్రుడికే ఎదురుతిరిగి అతణ్ణికూడా ఓడించాడు. జయచంద్రుడికి ఈవిధంగా శాస్తి అయింది!

అప్పటినుంచి తెల్లవాళ్లు మనదేశానికి వచ్చే పర్యంతం మనదేశాన్ని పరిపాలించినవాళ్లు మహమ్మదీయులే. మహమ్మదీయులంటే తురకలన్నమాట. వాళ్లమతాన్ని మహమ్మదు అనే ఆయన కనిపెట్టేడు. అందుకే ఆ మతాన్ని పుచ్చుకున్నవాళ్లనందర్నీ మహమ్మదీయులంటారు.

మనదేశంలో పరిపాలించిన నవాబులలో చాలామందికి ఇతరమతాలంటే కిట్టేదికాదు. హిందూమతంమీద ఉండే ద్వేషంచేత వాళ్లు హిందూ దేవాలయాలను చాలామట్టుకు ధ్వంసంచేశారు. ఆ ప్రదేశాలలో ఆ రాళ్లతోనే మసీదులు కట్టించారు. మసీదంటే తురకలు ప్రార్థనచేసుకునే భవనం అన్నమాట.

మహమ్మదీయ నవాబులు మనదేశంలో గొప్పగొప్ప కట్టడాలను చాలా నిర్మించారు. ఆగ్రాలో ఉన్న టాజ్‌మహాల్ అనే కట్టడాన్నిగురించి చెప్పేనుకదూ. దాన్ని కట్టించిన షాజహాను అనే నవాబే ఢిల్లీలో కోటలూ, సభామందిరాలూ, మసీదులూ కట్టించాడు. ఇవన్నీ చూసితీరాలిట. షాజహాను చక్రవర్తి చాలా వైభవంగా రాజ్యంచేశాడట. అతడు కూర్చునే సింహాసనం బంగారంతోనూ, నవరత్నాలతోనూ నిండిఉండేది. అందులో ఉన్న రాళ్ల ఖరీదే ఎనభైలక్షల రూపాయిలుట!

ఢిల్లీ వెడితే మనం చూడవలసిన కట్టడాలలో కుతుబ్ మినార్ అనేది ఒకటి. లైట్‌హౌసుకన్నా చాలా ఎత్తుగా ఉంటుంది. పైకి ఎక్కడానికి మెట్లున్నాయి. పైకి ఎక్కి చుట్టూ చూస్తే, మేడలూ, మిద్దెలూ, అన్నీకూడా చిన్నచిన్నవిగా అగుపిస్తాయి!

ఇప్పుడుకూడా మనదేశానికి ముఖ్యపట్టణం ఢిల్లీయే. మనదేశాన్ని రాష్ట్రాలక్రింద భాగించి ఒక్కొక్క రాష్ట్రాన్ని ఓ గవర్నరు పాలిస్తాడని చెప్పేనుకదూ. ఈ గవర్నర్లందరికీ పైనఉండే అధికారికి వైస్‌రాయ్ అని పేరు. ఆ వైస్‌రాయ్ ఉండడం ఢిల్లీలోనే.

చెన్నపట్టణం,
1-6-41.

పిన్ని

# వేశ్యావృత్తి

శ్రీ ఎచ్చెర్ల జయప్రసాదరావు

కాంతానికప్పుడు పదిహేడో ఏడు. యింత చిన్నతనంలోనే, అన్ని పాపాలు అనుభవిస్తుంది. అమాయికురాలు. పెంపుడు తల్లికి వ్యతిరేకముగా నడవలేక, వ్యభిచారంలో దిగింది. సగం మనస్సుతో నిత్యం పడుతున్న బాధ సహించలేక, మనుస్సువిసిగి, మద్రాసులో, చదువుచున్న మేనత్తకొడుక్కి జాబు వ్రాసి ఆతనిరాకకై నిరీక్షిస్తుంది.

యింతలో లోనుండి రామారావుగారు వచ్చేరని కేక వినబడింది. కాంతం గుండెల్లో రాయి బడినట్లయింది. పైట సవరించింది.

"కాంతం! కాంతం! యింతేనా!"......అని ప్రవేశించారు రామారావుగారు.

"కాంతం! ఎంతసేపయిందొచ్చి తెల్సా? చూడు—ఇల్లా నా కళ్లల్లోకి చూడు......" కాంతం మాట్లాడలేదు.

"ఏం? మాట్లాడవేం?"...పిడుగుపడినట్టు గర్జించారు. రామారావుగారు.

అంతవరకూ ఆయాసముతో నిండిన గుండెలు గతుక్కుమన్నవి. గజ గజ వణికిపోయింది కాంతం.

రామారావు నిజంగా రౌడీ రామారావే...కిర్రు చెప్పులు, గ్లాస్కోమల్లు లాల్చి, గ్లాస్కోమల్లు పంచ, గోల్డుఫ్లేకు సిగరెట్టుకాలుస్తూ సానివీధిని బడి పోతూంటే, గుమ్మములోనుండి, గిరుక్కున లోనకు బోయేవారు సానులందరు. ఆయనంటే ఆవీధి హడల్!...

"మాట్లాడవేం? మొద్దులాగ!......నిన్నే అడిగేది!"......

నిరాధారిణైన కాంతాన్ని రామారావు పలుకులు, గడ గడ లాడించేయి. ఒకప్రక్కనుండి చెమటలు గ్రక్కుచు, "బాబూ!...మన్నించాలి. యి...క...యీ...వృ...త్తి...వి...స...ర్జి...ం...చా...ను..." అంతవరకూ కొండంత ఆశతో ఉన్న రామారావుగారి కోర్కెలు అడుగంటాయి. కర్కశంగా కనకమ్మా! కనకమ్మా! అని పిలిచేరు.

కనకమ్మ "బాబయ్యా! పొట్టకూటికి కష్టపడే నేను, ఎంతచెప్పినా వినక, పెండ్లి అని పలవరిస్తుంది. పెద్దవారు, తమరే యోచించా"లన్నది కొంచమైననూ కనికరములేక.

కాంతం "ప్రపంచములో పడుపువృత్తి నీచం. ప్రతీవారు వీళ్లమీద పవరు చలాయిస్తారు. నిష్కారణముగా, నిరాధారులపై.....సాని సర్వ హక్కులికి లొంగి ఉండాలన్న శాస్త్రమా?

"అయినా ఆడపిల్ల నింత హద్దుమీరనివ్వరాదు. ఆడపడుచులు అవివాహితులై యింటబడియున్న పదిరాళ్లు సంపాదించొచ్చు. మీ యిద్దరిపొట్టకి చాలదా?"అని సవాలుకొట్టేరు రామారావుగారు.

కాంతం "ఆ పొట్టకూటికోసమా!...వద్దు. వెధవ వ్య...భి...చా...రం! ఏపాపి పునరుద్ధించింది యీ వ్యభిచారం? ఆ పాపి కనబడితే రక్తం పీల్చి పిప్పిచేస్తా!..."

"మానము చీల్చివేస్తున్న యీ వ్యభిచారం."

"హిందూధర్మమునకు వ్యతిరేకమగు యీ వ్యభిచారం వనితాలోకమునకు దుష్కళంకమగు యీ వ్యభిచారం హృదయంలో ప్రవేశించి దహించేస్తున్నదే! హే! అనాధరక్షకా! నా జన్మసాఫల్యతకు మార్గములేదా?"...........

"యింతటితో యీ ఆడుబొంది అంతరించుటకు ఆజ్ఞ యియ్యవా?......అబ్బా! నేను...వినలేను, ఈ బాధ భరించలేను!" అంతవరకూ అధైర్యమొందిన కాంతం లేనిధైర్యం తెచ్చుకుంది.

"బాబూ! మీ...భా...ర్య...లు!...మీ...త...ల్లు...లు...మీ...చెల్లెళ్లు!...ఆడ...పుట్టువు గాదా? అనాధనగు నన్నిటులు అవమానపర్చుట, న్యాయమా? ధర్మమా?"...

దిగ్గున లేచేరు రామారావుగారు.

'కాంతం.'

'అత్తా! అత్తా! కాంతం ఎక్కడ?' అంటూ ప్రవేశించాడు ప్రతాపు.

'బావా! ఎన్నాళ్ళకి నీ దర్శనం? కుశలమేనా?' అని నవ్వుతూ కాంతం అడిగింది.

కాంతం అన్న మాటలు రామారావుగార్కి ఒక పెద్ద ఫిరంగిదెబ్బలాగు తగిలాయి. మనుష్సు తన స్వాధీనం తప్పింది. మనస్సులో రైళ్లు పరుగెత్తుతున్నాయి. యింత పెద్ద రౌడీ మూడు ముక్కలతో నిలువునా నీరైనాడు. అతి కష్టంమీద, వణికిపోయే కంఠంతో 'కాంతం! వెడతాను' అని "ఆదరణపూర్వకంగా" అని బయటపడ్డాడు.

తెల్లవారింది. యింట్లో కాంతం ప్రతాపులు కనబడలేదు. కన్న ప్రేమకన్న, పెంచిన ప్రేమ పెద్దది. ఎంతో శ్రమపడి [illegible] కనకమ్మ కండ్లనిండ నీరు నించింది., ఎన్నో ఆలోచనలు తెట్టాయి.

కాలచక్రం శీఘ్రగతిన తిరుగుతూంది.

"కష్టసుఖాలు కాపురముండవు. ప్రపంచములో కొంతవరకు సుఖము, కొంతవరకు దుఃఖము, సహజమయిన విషయాలు. నేడు దుఃఖించినది నీవెగాదు. నలభైకోట్ల హిందూ, ముసల్మానులు యీ దురాచారమగు పూర్వాచారమును బాపుటకు కంకణము కట్టేరు" అని ప్రతాపు మద్రాసులో ఒక అద్దె యింటి హాలులో కూర్చొని కాంతంతో ముచ్చటించాడు.

అందులో, "మీరొక్కరే అన్నది అన్నట్టుగనే, అదురులేక జరిపారు" అన్నది కాంతం. దానితో యిద్దరు విరగబడి నవ్వుకున్నారు. [అవిధంగా రోజులు గడిచిన కొద్దీ, అదృష్టవశాత్తూ ఒక ఆఫీసులో గుమస్తాగా చేరాడు ప్రతాపు, ఏభై రూపాయిలకు కొద్దిగా చదువు, సంగీతజ్ఞానం వున్నందువల్ల అనాధఆశ్రమ వార్డన్‌గా ప్రవేశించింది కాంతం.]

మూలనున్న గడియారం ఠంగ్ ఠంగ్ మని ఎనిమిది కొట్టింది.

"కాంతం! ఎనిమిదయింది. ఆఫీసుకి వెళ్లాలి" అన్నాడు ప్రతాపు.

"అంతేనా! నాక్కూడా ఆశ్రమానికి టైమయింది. యిద్దరం ట్రాములో పోదామా?"

"చాల్లెద్దురూ! ఏమిటమ్మా! ఎప్పుడున్నూ! అసహ్యంగా. మీ కసలు కనబడితే ఒట్టు" అంది కాంతం.

"వెర్రిదానా! సాయంత్రంవరకూ నేను కనబడితే ఒట్టు"

"మీరు నాకు కనబడరు. నేను మీకు కనబడను."

"దానికి ఒట్టెందుకూ?"

ఫక్కాలున నవ్వారు యిద్దరు. వీధితలుపు అప్పుడే తెరువబడ్డది.

కాంతం ఒళ్లు ఝల్లుమంది. పిడుగుదెబ్బకి భయపడినట్లు తుళ్ళిపడి చూస్తుంది. కుడిచేతిలో కమండలం, ఎడమచేతిలో రుద్రాక్షమాల, కాషాయి వస్త్రధారిణి ప్రవేశించి, "చేసినపాపములకు ఫలితమే కలిగెన్. ఆహా! ఏదీ! నా భాగ్యము. స్వామి కనిపించెన్!......అమ్మా! పట్టెడన్నము పెట్టగలరా తల్లీ! అమ్మా! మీరెవరు? ఆశ్చర్యంతో అడిగింది కాంతం. శుష్కించిపోయిన శరీరముతో 'నా చరిత్ర అడిగేవారు ఎవరమ్మా!......' యింకా! నన్ను క...ని...క...రించే...వారు. యీ ప్రపంచములో ఎవరన్నా ఉన్నారా? పా...పి...ని...! ఛం...ఢా...లి...ని...!"

ప్రతాపు నిశ్చేష్టుడై నిలబడ్డాడు. "అమ్మా! నిన్ను చూస్తుంటే మా అమ్మ జ్ఞాపకం వస్తుంది. నీవెందుకూ యింత యెర్రనెండలో భిక్ష ఎత్తడం? నీకెవ్వరూ లేరా?" అంది కాంతం.

అడిగినమాటకి వెంటనే జవాబు చెప్పలేకపోయింది. "లేకేమి! తల్లీ! ఒకే ఒక్కకూతురు. దాన్ని కష్టతరమైన కార్యములోకి దింపాను. నా శీలం కాపాడుకోవటం నా విధి అని, తన అయిష్టం తెల్పి పరారయింది. ఆరోజు మొదలు అదే విచారంవల్ల కృశించిపోతూ, ఆ పాపఫలితముకు యీ శరీరమును మోసుకుంటూ భగవన్నామస్మరణలో తీర్థయాత్రలుకి బయిల్దేరి యీనాటికి మద్రాసు చేరేను."

ముఖాన్నున్న స్వేద బిందువులు తుడుచుకుంటూ "మీ పేరేమి?" అన్నది కాంతం, దడ దడ కొట్టుకొనే గుండెల్తో!

"నాపేరా? నా...పే...రా... తల్లి! కనకమ్మ."

"అమ్మా!" అని కౌగలించుకుంది కాంతం.

పది గజాల దూరములో నిశ్చేష్టుడై నిల్చున్న ప్రతాపు "అత్తా!" అని పిచ్చికేక వేశాడు. సాయంత్రం సూర్యుడు తన కాంతిని గోలుపోతూ పశ్చిమ దిక్కు పట్టి పోతున్నాడు. ఆ సమయంలో కాంతం ప్రసాదుడైన ప్రతాపు ప్రతిమను చూస్తూ ముగ్ధురాలైంది. తనకు ప్రతాపుని మించిన వారెవ్వరున్నారు, లోకంలో? ఇద్దరు కలసి సంఘసేవకై జీవితము లర్పింప నిశ్చయించుకున్నారు

# ఫేషన్లు

'లీలా! రావే, త్వరగా.'

'ఒక్క ఫైవ్ మినిట్సమ్మా.'

'రైలు వేళయిపోయిందే!'

'లీలా! కారు డ్రైవరు తొందరచేస్తున్నాడే!'

'ఇదుగో నే, అయిపోయింది.'

'చీర కట్టుకోడం అయిందా?'

'చీరువాలో కనిపించడంలేదే.'

'అదేమే? అన్ని చీరలుండగాను!'

'చుక్కలచీర కనిపించడంలేదే.'

'పైన వుంది గళ్ల చీర కట్టుకుందూ!'

'చుక్కల రవికకి గళ్లచీర యెల్లా పనికొస్తుందే?'

'అదేవిటే!'

'చీరా రవికా 'మేచ్' అవాలా మరి!'

'మేచ్' ఏమిటే?'

'వూరుకుందూ, యీ కాలపు ఫేషన్లు తెలియవు నీకు.'

'రైలు దాటిపోయినట్లేలే మనకు.'

  

ఇదీ యీ కాలపు ఫేషను. కట్టుకున్న చీరెకి తొడిగిన రవిక 'మేచ్' అవాలి. 'మేచ్' అవడం అంటే మీకు అర్థమయిందా?...'మేచ్'కి సరియైన తెలుగుమాట లేదు. ఫేషన్ అంటే యీ కాలపు షోకు అని అర్థం చెప్పొచ్చేమో కాని 'మేచ్'కి సరిపోవడం అని చెప్పడానికి వీల్లేదు. ఏదో .'అతకడం' అని అనుకుందాం. గులాబీరంగు చీరకి యించుమించు ఆరంగు రవికే అతుకుతుంది. నల్లరంగు చీర కట్టుకుని ఎఱ్ఱరంగు రవికె వేసుకుంటే—వాళ్లకి ఫేషనంటే యేమిటో తెలియదు. ఈ 'మేచ్' అవడం ఒక్క చీరా రవికా లోనే లేదు. ఏరంగు చీర కట్టుకుంటే ఆరంగు రవిక తొడుక్కోడమే కాకుండా ఆరంగు గాజులే, ఆరంగు పువ్వులే పెట్టుకుంటే బాగుంటుంది. ఈ 'ఫేషన్ల' శాస్త్రం బాగా తెలిసినవాళ్లు ఆరంగు జోళ్లే గూడా వేసుకుంటోంటారు. ఇది యిప్పడు అమలులోవున్న 'ఫేషన్'. ఈ తీరే ఎప్పుడూ వుంటుందనుకోకండేం. ఈరోజు ఫేషన్ రేపు వికృతంగా మారవచ్చు. పది సంవత్సరాల్నాటి వికృతం యీరోజు ఫేషన్‌గా పరిగణింపబడటంలేదూ! అంతగా యెందుకూ, బొట్టు సంగతి చూడండి. కనబడీ కనబడనట్టు అగరుచుక్క నుదురుమధ్య పెట్టుకోడం నిన్నటివరకూ ఫేషననుకున్నాం. అవధానిగారి భార్య సూరమ్మగారు దమ్మిడీ కాసంత కుంకుంబొట్టు పెట్టుకొని క్లబ్బుకివస్తే అంతా, పడుచువాళ్లంతా, విరగబడి నవ్వేవాళ్లు. కాని,

యిప్పుడో, అణాకాసంత కుంకుంబొట్టు పెట్టుకోడం నాగరికతలా పరిగణింపబడుతోంది. ఏ సోమిదేవమ్మ గారి అమ్మమ్మయో పూర్వం జూకాలు పెట్టుకొనేది. రానురాను జూకాలు దుద్దులుగా మారాయి. కొన్నాళ్లకి దుద్దులు పోయాయి. రెండు మూడు సంవత్సరాల్నించి చెవులు చిన్నపోకుండా లోలకులు తగిలించు కుంటున్నారు. లోలకుల ప్రాభవంగూడా పోతోందిలెండి. చిత్రం; ఇంతకాలమూ మాటుమడిగివున్న జూకాలే పడుచువాళ్ల చెవులకింద ఉదయిస్తున్నాయి! చెప్పేదేమంటే ఫేషన్లు అనుక్షణమూ మారుతోంటాయి. అంతర్జాతీయ రాజకీయాలేనా ఒక్కొక్కప్పుడు స్థబ్ధుగా వుంటాయి కాని ఫేషన్లుమటుకు ఒకేలాగుండవు.

ఎందుకూ ఒక్కమాటలో చెప్పి ముగిస్తాను. ప్రస్తుతం అమలులో వుండే ఫేషన్లు:-

చీరారవికా 'మేచ్' అవాలని యీ వరకే చెప్పానా! ఇంక పువ్వులుపెట్టుకోడం-వికారంగా పువ్వులజెడ, అంటే తోకజెడకి పువ్వులు కుట్టుకోడం, యిప్పుడు అమలులోలేదు. సన్నటిపువ్వులు చక్కగా దండగుచ్చి అర్థ చంద్రాకారంగా సిగచుట్టూ లేక బర్మాముడిచుట్టూ కట్టుకోడం చాలామంది చేస్తున్నారు. మల్లిపువ్వులు, జాజిపువ్వులూకన్న యిప్పుడు లేడీ కనకాంబరం పువ్వులు వాడుకలో వున్నాయి. కనకాంబరంలో వుండే విశేషం ఆ పువ్వులు అన్నిరంగులలోనూ దొరకడమే. చెవులకి చిన్నజూకాలు. జూకాల మీద చాలామోజువుంది యిప్పుడు. ఇంక చేతులకి గాజులు. మూడు నాలుగు సంవత్సరాలక్రితం ఫేషను ఒక్కొక్కచేతికి రెండో మూడో సన్నటి బంగారుగాజులు వేసుకోవడం. ఆతీరు క్రమంగా పోయింది కొన్నాళ్లకి. ఎడమచేయి రిస్టువాచీ పెట్టుకోడంతోటే సంతృప్తిపడింది. ఎడమచేతికి రిస్టువాచీ తగిల్చినప్పుడు కుడిచేతికి ఏమీలేకుండా వుండడం ఏంబాగుంటుందని యిప్పుడు మీరనుకోవచ్చు. కాని అప్పుడు అల్లాగెవరూ అనుకోలేదు. తోలుసంచీవో పూలుతో నేర్పుగాఅల్లిన 'పర్సో' కుడిచేతిలో వుంటుందిగా! ప్రస్తుతం ఫేషను యేమిటిఅని అడగవచ్చు. గాజులు మళ్లీ వీటియథాస్థానం ఆక్రమించుకున్నాయి ద్విగుణీకృతంగా. చేతికి 8, లేక 10 గాజులు వేలంవెఱ్ఱిగా వేసుకోడం యిప్పుడు నాగరికతగా పరిగణింప బడుతోంది. గాజులలో యింకో నవీనపద్ధతిగూడా అమలులోవుంది. వెండిగాజులు హిందూ స్త్రీలు వేసుకోడం మీ రెప్పుడైనా విన్నారా! ఇప్పుడు కొంతమంది వెండిగాజులు వేసుకుంటున్నారు. దంతం లేక కొమ్ముతోచేసిన గాజులుగూడా నాజూకుగా వుంటాయి. ఇంక ముఖానికి కుంకుమ - రంగు రంగుల కుంకుమ బజారులో దొరుకుతోంది. ఎఱ్ఱ, ఆకుపచ్చ, నీలం రంగులకుంఖం ఒక్కొక్క తులం కొని వాటిలో తళ తళలాడే అభ్రకం పొడి కలిపి వేరే డబ్బాలలో జాగ్రత్తపెట్టుకోడం ప్రతీ చిన్నదానికి అలవాటైపోయింది.

అనుక్షణమూ మారుతూవున్న ఫేషన్లు గ్రహించి అమలులో పెట్టడం ఆధునిక స్త్రీల విధి. ఏది ఫేషనో గ్రహించడమెల్లాగని అడగవచ్చు మీరు, దానిలో అట్టే కష్టంలేదు. ఎక్కువమంది, అంటే సమాజంలో స్థానంతెచ్చుకున్న స్త్రీలలో చాలామంది, ఏ ఫేషన్లు అవలంబించారో అదేఫేషను. ఆవిడ కట్టు బొట్టూతీరూ కంటికింపుగా వుందా లేదా అని ప్రశ్నించుకుంటే లాభంవుండదు. వాళ్లంతా యిల్లా కట్టుకుంటున్నారు, వాళ్లంతా యీల్లా బొట్టు పెట్టుకుంటున్నారు, వాళ్లంతా యిల్లాంటిగాజులు వేసుకుంటున్నారు అని మీకు తోస్తే అదేఫేషననుకోండి. 'వాళ్లు' అంటే ఎవరు? అని అడుగుతారేమో. 'వాళ్లు' అంటే నేను చెప్పలేను. వాళ్లెవరో మీకే తెలుస్తుంది.

—లీల

# ★ నక్షత్ర ఫలితాలు

కవికలహంసి
శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి

## ● జ్యేష్ఠ మాసము ●

**అశ్విని**
పుత్రమిత్రకళత్ర సౌఖ్యం; మనోరథసిద్ధి; సౌభాగ్యం

**భరణి**
నైచ్యము; కృషివాణిజ్యములు వ్యర్థమగుట; జ్వరము

**కృత్తిక**
శత్రుభీతి; ధననష్టము; ప్రయాణములో భయం

**రోహిణి**
కార్యవిరోధం; దుర్వార్తాశ్రవణం; కలహం

**మృగశిర**
భ్రమణము; లోహవిక్రయం; ధనక్షయం

**ఆర్ద్ర**
ధనార్జన; సంచారము; శస్త్రచికిత్స

**పునర్వసు**
మణులవర్తకమువలన లాభం; వాతదోషం; రాజకోపం

**పుష్యమి**
స్వబంధుకలహం; స్త్రీ సాంగత్యము; కీర్తి

**ఆశ్లేష**
ధైర్యము; ధాన్యనష్టము; పరగృహ వాసం

**మఖ**
మేహరోగం; ఉద్యోగములో సంతుష్టి; స్వబుద్ధిరీతిని వర్తించుట

**పుబ్బ**
రాజభయం; బంధనం; వ్యర్థ ప్రయత్నం

**ఉత్తర**
సౌఖ్యం; సాహసం; తల్లికిసౌఖ్యం; కీర్తి

**హస్త**
విచారం; భీతి; దేవళంసొత్తు లభించుట

**చిత్త**
వృథావిరోధం; వర్తకములోలాభం; ప్రభుసహాయం

**స్వాతి**
దుస్సహవాసం; శస్త్రబాధ; కోర్టుచిక్కులు

**విశాఖ**
మనోవ్యాకులం; విద్వత్సహవాసం; ధర్మకార్యము

**అనూరాధ**
అధ్యత్నత; ప్రభుమూలమున భాగ్యం; గృహలాభం

**జ్యేష్ఠ**
నేత్రరోగం; గృహమందుశుభకార్యం; ఋణము

**మూల**
దుర్బలత్వం; కృషివిఘ్నం; సుగంధ వ్యాపారలాభం

**పూర్వాషాఢ**
గృహచ్ఛిద్రం; పుత్రపీడ; కాసరోగం

**ఉత్తరాభాద్ర**
త్రిప్పటలు; మిత్రులమూలమునలాభం; క్లేశము

**శ్రవణం**
ద్రోహబుద్ధి; ప్రభుదర్శనం; కొద్దిలాభం

**ధనిష్ఠ**
స్వయంప్రయత్నం; చిత్రకళ; కడుపునొప్పి

**శతభిషం**
పొక్కులు; అధికారం; ప్రయాసం

**పూర్వాభాద్ర**
భూషణప్రాప్తి; స్థానచలనం; ధర్మకార్యం

**ఉత్తరాషాఢ**
క్షేత్రదర్శనం; యత్నకార్యసిద్ధి; నిర్విచారం

**రేవతి**
అకీర్తి; మృష్టాన్నభోజనం; ధనాగమం




గోధుమలతో తయారుచేయదగిన వివిధ పదార్థములు—11.

## గోరుమీఠీలు

¼ శేరు మైదాపిండి కొంచెము నీళ్లువేసి గట్టిగాకలిపి చిన్నవుండలుచేసి వాటిని చేతిలోపట్టి గోరుతోనొక్కి బాణలిలో నెయ్యిపోసి బాగ వేగినతర్వాత, నొక్కి సిద్ధముగావుంచినవి వేసి వేగినతర్వాత ½ సోల చక్కెర లేతపాకము పట్టి అందులోవేసి కొంచెము యాలకుపొడి చల్లి తీసుకోవలెను.

## చీపురుపేణీలు

¼ శేరు విసిరిన మెత్తని బియ్యపుపిండి, 1/8 శేరు మైదాపిండి, ¼ శేరు పాలు కలిపి ముద్దగాచేసి బాణలిలో ¼ వీశె నెయ్యిపోసి బాగా కాగినతర్వాత ఆ ముద్దను జంతికలు గొట్టములోవేసి పిండి బాగవేగిన తరువాత యిష్టమైన పాకములో వేసుకోవలెను. లేక పూరికినే వాడవచ్చును. పాకమునకు ¼ వీశె పంచదార చాలును.

—అద్దంకి బాలాత్రిపురసుందరి.

## యంజనపాపిసు జిల్లుడికాయ

తవ్వ పచ్చిపిండి, కాలు అఠాకు గోధుమపిండి కలుపుకొని ముంతమామిడిపప్పు, సారెపప్పు, గుమ్మిడిపప్పు, దోసపప్పు వేచి పిండి జిల్లుడికాయమాదిరి చేసి దానిలో యీ పప్పులుపెట్టి మడిచి నేతిలో దేవేది.

## సూర్యకాంత

తవ్వ గోధుమనూక అరపడి పెరుగుపోసి వుడకపెట్టి గోధుమనూక వేసి, పారటి పచ్చిమిరప కాయలు, అల్లం, కొత్తిమిల్లి, పచ్చికరేపాకు సన్నగా తరిగి దానిలోవేసి నిమ్మకాయరసం కలిపి గోధుమనూక తడిపి అప్పం మాదిరి తట్టి చమురులో దేవేది.

## మైసూరుమనుగుంబువ్వ

అఠాకు గోధుమనూక, అర అఠాకు పచ్చిపిండి, అల్లం, పచ్చిమిరపకాయలు తరిగి ఉప్పువేసి పెరుగులో కలుపుకొని నూనెలో పిండవలయును.

## బొంబాయి మనుగుప్పు

ఆళాకు గోధుమనూక, అర ఆళాకు గోధుమపిండి, అర ఆళాకు పచ్చిపిండి ఈమూడు ఉప్పువేసి కలిపి నేతిలో తేంతొలపీటలో పిండవలెను.

## మసాల జిల్లుడికాయ

గోధుమపిండి అప్పడాలు చేసుకుని ముంతమామిడి పప్పులు, దోసవిత్తులు, ఉప్పు, పచ్చిమిరప కాయలు వేసి కుమ్మి జిల్లుడికాయమాదిరి చేసి నేతిలో దేవవలయును.

## చంద్రకళ

గోధుమపిండి అప్పడాలు చేసుకుని ముంతమామిడిపప్పు, దోసపప్పు వేయించి చక్కెర వేసి కుమ్మి అప్పడములో పోసి పైన మరొక్క అప్పడమువేసి కజ్జికాయ చక్రముతో చుట్టూ గీచి నెయ్యిలో దేవవలెను.

## బొంబాయి హల్వా

పాలు మసలినవెనుక గోధుమపిండివేసి బాగుగాపొరటి చక్కెరవేసి ముంతమామిడిపప్పు, సార పప్పు వేయించి పోసేది.

## వుర్లగడ్డల మనుగుపూలు

పదిపలాలు వుర్లగడ్డలు ఆళాకు గోధుమపిండి, ఆళాకు పచ్చిపిండి, నిమ్మకాయరసం పిండి, వుప్పు, పచ్చిమిరపకాయలు వేసి మణుగుపువ్వు పీటలో పిండవలెను

## మేజావడ

అరవీసె ముంతమామిడిపప్పు ఆళాకు పచ్చిపిండి ముక్కాలు ఆళాకు గోధుమపిండి, మూడుచేర్చి రుబ్బి వడమాదిరితట్టి నెయ్యిలోదేవేది. కావలెనంటే పెరుగులో తిరుగుమాత పెట్టి ఈ వడలు దానిలో వేయవలెను.

## మామిడిపండ్ల పోళి

రెండు పెద్ద మామిడిపండ్లరసము పిండి కాలు ఆళాకు గోధుమనూక, కాలు ఆళాకు గోధుమ పిండి, రసము కాగుతూవుంటే నూక, పిండిపోసి పొరటి, అప్పంమాదిరితట్టి నేతిలో దేవవలెను.

## మడుపు పోళి

ఆళాకు దోసవిత్తులు, ఆళాకు పచ్చిపిండి, కాలు ఆళాకు గోధుమపిండి అంతాచేర్చి రుబ్బి దోశ పోసి మెత్తగా నెయ్యిరాచి చక్కెరలో పొర్లించి చొకముగా మడిచేది.

## బంగాళా సుగియలు

ఆళాకు శెనగపప్పు నానవేసుకుని, వుడికించిన వురలగడ్డలు వుప్పువేసి రుబ్బుకొని పచ్చిమిరపకాయలు, అల్లం, కొత్తిమిల్లి, ముంతమామిడిపప్పు అన్నీ సన్నముగా తరుగుకొని, ముద్దజేసుకోనేది. గోధుమపిండి, పచ్చిపిండి, వుప్పువేసి జారుగా కలుపుకొని పైచెప్పిన బంగాళాదుంపముద్దను చిన్న ఉండలుచేసి పిండిలోముంచి నూనెలో దేవేది.

## గోధుమనూక సియ్యాలి

అర ఆళాకు గోధుమ నూక నిమ్మకాయ రసముపోసి పచ్చి మిరపకాయలు సన్నముగా తరిగివేసి ఒక అటక పాత్రలో ఎసరు పెట్టి చిన్న ఆటకలో గోధుమనూక అంతా కలిపి అటక పాత్రలో చిన్నపాత్ర పెట్టవలెను.

## ద్వారాదా కారాసు

తట్టకు నెయ్యి నీళ్లు వేసి నురుగు వచ్చేటట్టు రుద్ది రెండళాకులు గోధుమనూక, రెండు ఆళాకుల గోధుమపిండి, పచ్చిమిరపకాయలు, వుప్పు నూరి కలిపి సోడా నిమ్మకాయరసం నీళ్లువేసి కలిపి కారాసు పీటల్లో పిండేది.

## దోసవిత్తుల బిస్కత్తులు

తట్టకు నెయ్యి నీళ్లువేసి నురుగువచ్చేటట్టు రుద్ది రెండళాకులు గోధుమపిండి ఒకటిన్నర ఆళాకు దోసవిత్తులు మెత్తగా కాటుకవలె రుబ్బి గోధుమపిండిలోవేసి కాలు ఆళాకు చక్కెర అరఆళాకు వెన్నవేసి మేదించి పిసికి బిళ్లలుగాతట్టి బొందలుపొడిచి ఒక బాణలిలో యిసుక కాలినవెనుక దానిమీద ఒకరేకువేసి ఈ బిళ్లలు ఒకతూరికి 5, 6 చొప్పునవేసి తీయవలెను. మాడనివ్వకూడదు.

## బందరు సోమాసి

గోధుమనూక అప్పడముచేసి ఒకటిమీద నెయ్యిరాచి రెండో అప్పడం పైనవేసి ఈమాదిరి మూడు అప్పడములు వేసి కలియ పామి ముంతమామిడి పప్పు చక్కెరవేసి కుమ్మి పూర్ణంపెట్టి కర్జికాయ మాదిరి చేసి నేతిలో దేవేది.

—ఎం. ఎతిరాజమ్మ.

## —— బంగారుపతకం బహుమానం ——

గోధుమ ధాన్యముతో చేయదగిన పలువిధములైన పదార్థములను, గత సంచికల లోని పది పట్టీలయందు ప్రకటింపబడినవి గాక, ఎక్కువ పదార్థములను వ్రాసి పంపినవారికి ఒక 'బంగారుపతకము' బహూకరింపబడును. వెనుక గృహలక్ష్మిలో ప్రకటింపబడిన వాటినిగూడ ఎత్తివ్రాయకూడదు.

సంపాదకుడు.

# చలన చిత్రాలు

## నర్తకి

న్యూ థియేటర్సువారి హిందీ టాకీ. ఏప్రిలు నెలలోనే మదరాసు స్టార్ టాకీసులో ప్రెస్ షో జరిగినది. సుప్రసిద్ధ 'విద్యాపతి' చిత్రమును డైరెక్టుచేసి ఖ్యాతిగన్న దేవకీబోసు దర్శకత్వమున వెలువడినదే 'నర్తకి' కూడాను. అయితే విద్యాపతికీ నర్తకికీ సాటీలేదు పోటీలేదు. ఇదొకరకం. ఇది టెక్నికల్‌గా చాలా బాగున్నదంటారు కొందరు. ఇందులో పంకజ్ మల్లిక్ మ్యూజికల్ డైరెక్షను చేయడమే కాక ఒక కవిపాత్ర దాల్చి బాగా గానంచేశాడు కూడాను. ఆయన వేషం బాగా తయారుచేశారు. లీలాదేశాయి, నజాం ప్రముఖభూమికలు దాల్చారు. జగదీశ్ కొత్తరకం పాత్రధారణచేసి బాగానే నిర్వహించాడు. భారతదేశపు మఠములలోని కఠోరనియమాలు, క్రమశిక్షణతో కూడిన బ్రహ్మచర్యవ్రత నిష్ఠాగరిష్ఠతయొక్క మహాత్త్వము ఇందు ప్రదర్శింపబడినవని చెప్పవచ్చును. కథ సుఖాంతముగా ముగియక ఒక Tragic element తో అంతమగుట సామాన్య ప్రేక్షకులకు ఆశాభంగముగా ఉండును. నర్తకి యను పేరు పెట్టబడిన ఈ ఫిల్ము లో మొత్తము మూడుమారులే కాబోలు నాట్యముచేసిన లీలాదేశాయి నృత్యము ఒక్కసారే బాగున్నదనిపించినది. ఫోటోగ్రఫీ ఆడియోగ్రఫీ బాగున్నవి. సంగీతమ్ము బాగున్నది. కథలో తగినంత చలనము వేగము లేవు అనిపించినది. సెట్టింగ్సు, సీనరీ చాలా బ్రహ్మాండముగా ఉన్నవి. మొత్తముమీద యీ ఫిల్ము జనరంజకముగా ఉన్నదనుటకంటె, కొత్తరకముగా విలక్షణముగా ఉన్నదనుటయే సరి.

న్యూ థియేటర్సు సృష్టిని తేలికగా ఆక్షేపించలేము గదా?

## దక్షయజ్ఞము

ఇదివరకు జయా ఫిలిమ్సు అనబడుచుండి యిప్పుడు శోభనాచలపిక్చర్సు అను నామాంతరము బొందిన శ్రీ మీర్జాపురం జమీందారువారి స్వంత స్టూడియోలో తయారైన యీ తెలుగుటాకీ మేనెల 9-వ తేదిని మదరాసు గెయిటీ థియేటరులో ప్రి వ్యూ చూపబడినది. ఈ చిత్రము డైరెక్టరు చిత్రపు నారాయణమూర్తిగారు బి. ఎ. కవి, బి. టి. నరసింహాచారిగారు. ప్రధానభూమికలు నిర్వహించినవారు గగ్గయ్య, కృష్ణవేణి, రామకృష్ణశాస్త్రి మొదలయినవారు.

సతి కృష్ణవేణి తనపాత్రను చక్కగా నిర్వహించినది.

ఫిల్ము అతి దీర్ఘముగా కొన్నిచోట్ల కొంత విసువుగా తోచినది. కొన్నికొన్నిచోట్ల కత్తిరించివేసి తగ్గించవచ్చును.

మొదటిభాగముకంటె రెండవభాగము బాగుగా నడిచినది. ప్రారంభపు సీనులు బాగుగనేయున్నవి గాని చివర చివర భాగములు చాలా బాగున్నవి. శివుడు సతి కలుసుకొని కైలాసమునకు చేరకొన్నప్పటి నుండి ఫిల్మును వేగము వచ్చినది. బిగువు హెచ్చినది. శివుని సన్నిధిని జరిగిన నాట్యము, చివరభాగమున ప్రళయతాండవము చాలా బాగున్నవి. ఈ సీనులకోసము దేవీప్రసాద్ ఘటక్‌గారిని నియోగించడములో ఫిల్ము నిర్మాతలు ప్రశంసాపాత్రులు. దక్షయజ్ఞ సంబంధమైన సీనులతావునుండియే సంభాషణలను

బాగున్నవి. కథ రక్తి కట్టినది. చివరభాగమున The spirit of the play ను బాగా తీసుకొని రాగలిగినారు. ముగింపు రసవత్తరముగను హృదయస్పర్శముగను ఉండునట్లు చేసి యీ ఫిల్ము నిర్మాతలు ధన్యులైరి.

చూడామణి

ఈ తెలుగు సాంఘిక చిత్రమును పత్రికలవారికొఱకు మే 11వ తేదీని మదరాసు స్టార్ టాకీసు హాలులో ప్రదర్శించారు.

ఈ ఫిల్ము ప్రొడ్యూజర్సు శ్రీ జానకీపిక్చర్స్‌వారు. డైరెక్టరు రాజాశాండో. పాటలు మాటలు వ్రాసినది సదాశివబ్రహ్మం. నటీనటులు: పుష్పవల్లి, సి. ఎస్. ఆర్. ఆంజనేయులు, పులిపాటి వెంకటేశ్వర్లు, గురునాధరావు, సుందరమ్మ, సరస్వతి మొదలయినవారు.

ఈ ఫిల్ము అమితదీర్ఘముగా ఉన్నది. అసలు కథకు సంబంధించని అనవసరపు భాగములను చాలావరకు కత్తిరించివేయవచ్చును. అసభ్యతా సూచనలకు, అర్థవిహీనమగు హాస్యమునకు తావీయకుండిన, ఎంతో బాగుండును. అత్యంత నవీనమగు సాంఘిక (సాంసారిక) కథలో miracles కు చోటేమిటి? ఈ మాయ సంఘటనలను ఫిల్మునుండి తొలగించివేయవలసి యుండును. చూడామణి కథలో పొందిక, ఐక్యత చాల తక్కువ. సందర్భశుద్ధిని హెచ్చుగా పాటించవలసినది. అనేక వంకరలుగా కథను నడిపి అనేక సంఘటనలుచేర్చి మొత్తంమీద stunt picture గా తయారుచేశారు. నేరాలు, హత్యలు అధికమయినవి యీ కథలో. మొత్తముమీద సహజముగా ఉండక ఏదో కృతకముగా (కృత్రిమముగా) ఉండినది. ఫిల్ములో డైరెక్షను ప్రతిభ ఏమీ కనబడలేదంటే కోపకారణముకారాదు. అయినా సి. ఎస్. ఆర్. ఈ చిత్రంలో చాలా బాగుగా తనపాత్రను నిర్వహించి జయముగాంచారు. సాంఘిక చిత్రాలలోనే ఈయన మేటిగా నటించగల సమర్థుడనిపించాడు. పుష్పవల్లి తన పాత్రను బాగుగా అర్థముచేసికొని సహజముగా నటించినది. వీరిద్దరూచేరి ఈ ఫిల్మును జయప్రదము చేశారనవలెను. సత్యవతి అను క్రొత్తనటి రూపవతి. ఈమె క్రొత్త అయినా గంభీరముగనే తనపాత్రను నిర్వహించినది. అయితే ఎవరో అన్నట్లు ఈమె దుఃఖ ప్రకటనకు అంతగా పనికిరాదేమో అనిపించినది. ముఖమున లావణ్యమున్నంత, భావప్రకటన లేదు.

ఫోటోగ్రఫీ మొత్తముమీద బాగుండినా, కొన్నిచోట్ల తప్పటడుగులు వేసినది. క్లోసప్‌లు కొన్ని, కిందినుండిపైకి తీయబడిన చిత్రములుకొన్ని అసహ్యముగనుండెను. ఈ ఫిల్ములో దిశమొలలతో ఉన్న ప్రతిమలను కొన్నిటిని ప్రవేశపెట్టుట అనవసరము, అనుచితము, అసభ్యమని కొందరి తలంపు... సారెగది సీనుకు, అందలి చేష్టలకు అంత ప్రాముఖ్యము ఈయనక్కరలేదు.

ఏదో నాట్యమొకటి ఈ ఫిల్ములోనూ ఉండవలెనని ప్రవేశపెట్టినట్లు స్పష్టముగా కనపడుచుండినా, శ్రీమతి హేమలతాదేవి డ్యాన్సు బాగానే ఉండెననవలెను. ఆమె ఎట్టిలోటు చేయలేదు. ఈ ఫిల్ములో దౌర్జన్యము, హింస, హెచ్చుగా కనపడినవి. మద్యపాననిషేధము యెడలను, అహింస యెడలను చౌకరకముగ దెబ్బలు కొట్టడము కనపడినది. ఇవి bad taste కు నిదర్శనములు. రాజాశాండోగారి భావి తెనుగు చిత్రములు ఇంతకంటె సహజముగ సౌందర్యముగా నాతిదీర్ఘములుగా నుండగలవని నమ్మెదము.

# గ్రంథసమీక్ష

బాలగీతావళి (ఐదవ తరగతికి): వేంకట పార్వతీశ్వర కవుల రచన. కాకినాడ ఎడ్యుకేషనల్ పబ్లిషింగ్ హౌస్‌వారి ప్రచురణ. క్రౌను సాదా సైజు 35 పుటలు 3 అణాలు. పాఠములన్నియు సులభమైన పద్యాలలో ఉన్నవి.

ప్రభాతము, సంధ్య: దేవరకొండ బాలగంగాధరతిలక్ విరచితము. నవోదయ రేఖావళి, తొలి రేక. ఈ ఖండకావ్య సంపుటికి "త్రివేణీ" పత్రికా సంపాదకులు శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు పరిచయవాక్యాలు వ్రాసి యీ నవకవికి ప్రోత్సాహమిచ్చారు. ఈ గేయాలూ పద్యాలూ మధురముగా ఉన్నవన్నారు. శ్రీ కృష్ణశాస్త్రి, వేదుల-వారి ఛాయలు ఈ రచనలలో పొడగట్టుతున్నవన్నారు. శ్రీ నుల్ల వరపు విశ్వేశ్వరరావుగారి నవ్యకవిత్వానికీ ఈ దేవరకొండవారి పోకడలకూ కొంత సామ్యం ఉన్నదన్నారు.

ఈ భావకవికి స్వాగతమూ ప్రోత్సాహమూ యిచ్చి ఆదరింపదగిన రచనలు ఈ సంపుటంలో ఉన్నవి. ఫెదర్ వెయిట్ కాగితాలపై అచ్చు, మంచి నీటయిన రేపరుబైండుతోనూ ఈ సంపుటం ముచ్చటగానే ఉన్నది.

మౌలానా ఆజాద్ జీవితచరిత్ర—రామఘర్ కాంగ్రెసు: రచయిత: కొమాండూరి శఠకోపాచార్యులు, ఎం. ఏ. బి. ఎల్, కాకినాడ: 1940 మార్చి ప్రచురణ. వెల 6 అణాలు. క్రౌను సాదా సైజున 88 పేజీలు. "ఇప్పుడు భారతదేశము రెండు ఖండములుగ జేయుటకు, హిందూ ముస్లిముల మధ్య మైత్రి చెడగొట్టి, దేశపు దాస్యబంధము బలపరుచు యత్నము జరుచుచున్న" రోజులలో రాష్ట్రపతియై యున్నట్టియు; శాంతి, అహింస, ధార్మికత, వినయము, సాంఘికమైత్రి, జాతీయైక్యము, మూర్తీభవించి యున్నట్టియు, మహనీయుడు నిరాడంబరజీవియగు మౌలానా అబుల్ కలాం ఆజాద్‌గారి జీవిత చరిత్ర సంగ్రహమును, రామఘర్ కాంగ్రెసు వృత్తాంతములు, రాష్ట్రపతి అధ్యక్షోపన్యాసమును చేర్చి చాల ఉపయోగకరముగా చేసిన యీ రచన అందరూ చదివి మేలు బడయగలరని నమ్మెదము.

సూర్యకిరణ చికిత్స: గ్రంథకర్త: పండిత జ్వాలాప్రసాద్ ఝూ. అనువాదము: డాక్టరు పుచ్చా వెంకట్రామయ్యగారు, ఎన్. డి. (ప్రకృతి వైద్యసిద్ధాంతమునకు చెందినవారు.) 80 పేజీలు వెల 6 అణాలు. బెజవాడ ప్రకృతి కార్యాలయ ట్రస్టు ప్రచురణ. Chromopathy అను వర్ణచికిత్స పద్ధతి క్రమమంతయు యిందు తేటతెల్లముగ వివరింపబడినది. చాలా ఉపయోగకరమైన పుస్తకమిది.

మూఢ ముకురము: పట్టిసపు శ్రీరామమూర్తి రచన. విశాఖపట్టణం జిల్లా, గవళవరము పోస్టు, వరహాపురములోని శ్రీ రామాంధ్ర గ్రంథాలయమున ప్రతులు దొరకును. చిన్నసైజు 19 పుటలు, వెల 1 అణా. శ్రీ శంకరాచార్య విరచిత ద్వాదశ మంజరికా స్తోత్రము, వారి శిష్యులు కొందరు రచించిన శ్లోకములు కొన్ని అనువదించి తెనుగు పద్యములుగ చేర్చి కూర్చినారు.

శ్రీ కోదండరామ శతకము (లఘుటీకా సహితము): బుచ్చిరెడ్డిపాళెమునకు చెందిన విద్వాన్ ఏ. క. వరప్రసాదరాయకవి రచన. క్రౌను సాదాసైజున 28 పేజీలు. వెల 2½ అణాలు.

"గాయక సార్వభౌమ" పారుపల్లి రామకృష్ణయ్యపంతులవారి జీవితచరిత్రము: విమర్శక శిరోమణి, సాహిత్యవిశారద కోన వేంకటరాయశర్మ విరచితము. (స్టూవర్టుపురము, వయా బాపట్ల.) 1940 ప్రచురణ. క్రౌను సాదాసైజున 44 పేజీలు. (ఆంధ్రాభ్యుదయము, ప్రథమభాగము నుండి గ్రథితము) వెల 3 అణాలు.

హిందూ వైదికవివాహము: బెజవాడవాసి గుండా కృష్ణమూర్తిగారిచే ప్రచురింపబడినది. 1940. ఓంకార గ్రంథమాల, అష్టమప్రసూనము. వెల తెలియదు. క్రౌను సాదాసైజు 90 పేజీలు. గ్రంథనామము బట్టియే గ్రంథస్థ విషయము తెలియనగును.

స్నేహలత : సూరి రాజగోపాలము రచన. 1941 లో నిడదవోలులో ప్రచురణ. వెల 3 అణాలు. మైత్రి, పరిచయము, గౌరవనీయములు, స్త్రీ మైత్రి లేక సాంగత్యము, రూపలావణ్యము అవి ఇందలి వివిధ శీర్షికలు. క్రౌను సాదాసైజు 30 పేజీలు.

వేదమే ఈశ్వరీయజ్ఞానము : వైదికధర్మ గ్రంథమండలి, మొదటి ప్రచురణము. ప్రమాది ఆశ్వయుజము, వెల మూడణాలు. కర్త : పండిత శివశంకరశర్మ కావ్యతీర్థ. అనువాదకులు : పం. ధూ. రాజరత్నాచార్యులు. క్రౌను సాదాసైజున 55 పేజీలు.

వేదము ఈశ్వర ప్రేరితమనీ, అభ్రాంతమనీ నమ్మువారికీ, ఆర్య సామాజికులకూ యిష్టమైన రచన.

## గ్రంథ స్వీకారము

ఈ క్రింది పుస్తకములూ, పత్రికలూ విమర్శనార్థము మా కార్యాలయమునకు వచ్చినవి. కృతజ్ఞతతో వీనిని స్వీకరించుచున్నాము. వీనిపై విమర్శాదికము వచ్చే సంచికలో ప్రచురింపగలము. స్థలాభావముచే ఈమారు ప్రకటించుటలేదు :—

దానధర్మపద్ధతి (బిక్షుకసమస్య) : ఎంబార్ భాష్యాచార్యుల అనువాదము.

చిత్ర సావిత్రీయము : అయినాల వెంకటస్వామినాయుడుగారి రచన.

భగవద్గీత : గుఱ్ఱం వెంకట సుబ్బరామయ్య యం. ఎ. సంపాదకులు.

కర్మయోగము (వివేకానంద ప్రవచనము) అనువాదకుడు మాధవచైతన్య బ్రహ్మచారి.

నేటి గిరీశం : (1వ భాగము) రచయిత బి. టి. నరసింహాచార్యులు.

లీలావతీ నాటకము : తెన్నేటి వెంకటదీక్షితులు రచన.

సవతితల్లి (ఐదంకముల సాంఘిక నాటకము) : వేంకట వీరరాజకవుల రచన.

స్త్రీల చరిత్రము : (శోధితము, సంవర్ధితము) 3వకూర్పు. కొమాండూరి శఠకోపాచార్యుల రచన.

పడకటింట్లో విజ్ఞానచర్చ : కర్త, వసంతరావు వెంకటరావు, ఎమ్. ఎస్‌సి.

భారతీయ నాగరికత, అహింసాతత్వము (మొదటిభాగము) : కొమాండూరి శఠకోపాచార్యుల రచన.

మాలతీగుచ్ఛము : మాడపాటి హనుమంతరావుగారి కథలు.

ఉదయభారతి (ఉగాదికానుక) : సంపాదకుడు పాటిబండ మాధవశర్మ ఎం. ఎ.

హింద్రీప్రచార్ సమాచార్. 1941 మేనెల సంచిక. దక్షిణాది హిందీవిద్యార్థుల - ఉపాధ్యాయుల అవసరములనెరిగి యనేక నూతన అంశములతో సహా వెలువరింపబడినది.

విశ్వజనని : (సంపుటి 1. సంచిక 2) మేనెల. మాసపత్రిక. సంపాదకురాలు ఎన్. యామినీ పూర్ణతిలకమ్మ గారు.

---



# సంపాదకీయములు

## నైజాంవారి మహదాశయములు

“సంకుచిత స్వభావుడనై, ఏ మతమువారియొక్క గాని, ఏ కులమువారియొక్క గాని, మతమును గాని మనస్సునుగాని నొప్పించుట నా అభిమతముగాదు అట్లని నా మతమునకు ద్రోహుండనను అపయశమును ఆర్జించుట అంతకన్న నా అభిమతముగాదు. అన్ని మతములను భేదములేకుండా, ఎవరికి ఎట్టిఅడ్డు కల్పించకుండా సమానదృష్టితో పరిపాలించుటయు, నాయొక్కయు మాతాత తండ్రులయొక్కయు కూడా నియమముగా నున్నది.”

ఈ మహద్వాక్యములు మహోఘనత వహించిన నైజాంప్రభువు ఒక హైదేరాబాదు పత్రికకు వ్రాసిపంపిన ఒక ప్రకటనలోనివి.

అయితే నైజాంవారు ముస్లింగ తాము ఏమి వ్రాసినను ఏమి చెప్పినను, పరిపాలకుడుగ చెప్పినటుల భావింపరాదనిరి.

పరిపాలకుడుగ దెలిపిన మాటలు, వ్రాసిన వ్రాతలు ముస్లింగ జెప్పినటుల దలంపరాదనియు, పరిపాలకులుగ తాము వివిధమతములవారిని వివిధకులముల వారిని పరిపాలించుచుందుమనియు అత్తరి అందరి యెడలను సమవర్తనులై మెలగుట తమ ధర్మమనియు, అట్టియెడ ఏ ఒకమతమునుగాని పరిపాలకునిగ అభిమానించినటుల చెప్పరాదనిరి.

“రాజకీయములు వేరు, మతము వేరు. రెంటిని గుచ్చి ఎత్తరాదు. వాటి స్వభావమే వేరు. నిష్కలుషమైన మనస్సుగలవారుగాని ఈ వ్యత్యాసమును గుర్తింపజాలరు. సమరసవర్తనులకే ఇది అర్థము కాగలదు.”అని కూడా నైజాంవారు వ్రాసిరట.

వ్యక్తిగతముగ తమ అభిప్రాయము లెట్టివైనను, మతము ఎట్టిదైనను, పాలకునిగ “సర్వేజనాః సుఖినోభవంతు” అను మతమునకు తాము చెందినవారమనియు, వివిధ మతములవారి కులములవారి ప్రార్థనా మందిరముల రక్షించుట అనుక్రమముగ వచ్చుచున్న తమ ధర్మమనియు, అది రాజ్యాంగమందలి ఒకభాగమనియు దెలుపుచు, ఇందులకు ఎనిమిదేండ్లక్రితము నైజాముప్రభు వొసంగిన ఒక ఫర్మానానుగూర్చి ప్రస్తావించిరట.

“నేను ఏ మతమునకు చెందినట్లు తలంపను. అట్లని నాస్తికుడనని అర్థము చేయరాదు. ఏ మతమునకును చెందననగా ఏ ఒక్క మతమునకుగాని ఏ ఒక్క కులమునకుగాని మాత్రమే నేను పాలకుడనుగాను అను సందర్భమున నే నేమతమునకును చెందను అని నా తాత్పర్యము. ఇట్టిమతమునే, నిష్పక్ష వర్తనమునే మా తాతముత్తాతలు తండ్రులు అవలంబించియుండిరనియు నేనును ఈ మార్గమునే అవలంబించుచున్నాననియు, మా తరువాతి పాలకులుకూడా భగవంతుడు బాగా మేలుచేస్తే ఈ మార్గమునే అవలంబింతురనియు దెలుపుటకు గర్వించుచున్నాను.”

మహా ఘనతవహించిన హైదరాబాదు నైజాం ప్రభువువారి పై మాటలు చదువుట కెంతయో సంతోషకరముగ నున్నవి. ఎట్టి పక్షపాతబుద్ధియులేక నిష్పక్షముగ తమ సంస్థానమునందలి సకల మతముల వారిని ఒకేవిధముగ జూచుచు అందరికీ సమానముగ మేలుజేయుచు సర్వశ్రేయోదాయకముగ యేలుట అత్యంతము ప్రశంసాపాత్రము కాగల విషయము.

అయితే నైజాంవారు వ్యక్తిగతముగను ముస్లింగను చెప్పుమాటలు వేరు, పరిపాలకునిగ చెప్పుమాటలు (వ్రాసేవ్రాతలు) వేరువేరు విధములుగ నుండినప్పుడే చిక్కువచ్చును. నైజాంవారు తాము ప్రథమతః న్యాయ పరిపాలకులమనియు, తర్వాతనే తమ మతమునకు స్థానమనియు సదా జ్ఞప్తియందుంచుకొనిన జాలును.

అసలు భారతదేశములోని వివిధ మతములకు కులములకు జాతులకు సంఘములకు సంస్థలకు చెందిన ప్రతి ఒక్కవ్యక్తియుకూడా మొట్టమొదట తాను భారతీయుడననియు, (అదే ప్రధానమనియు) తర్వాతనే తన మతాదికమునకు ప్రాముఖ్యమనియు హృదయపూర్వకముగ విశ్వసించి తదనుగుణ్యముగ నిత్యజీవితమున ప్రవర్తనమును సరిదిద్దుకొనిననాడే సమగ్ర భారతజాతీయ నవజీవన వికాసమునకును పునరుజ్జీవనమునకును అవకాశమేర్పడును.

కావలసినవి మాటలుకావు, చేతలు. **Example is better than precept. Deeds not words.** కులకక్షల తత్త్వము రాజకీయములలో పెరిగిపోవుచున్న ఈ చెడు రోజులలో నైజాంవారు తమ మహదాశయములను ప్రచురణచేయుట ఎంతయు తగియున్నది, గాని నైజాంసంస్థాన సంబంధ ప్రాంతమంతటను మహమ్మదీయేతరులగు ప్రజానీకమునకుగాని సంస్థలకుగాని ఎట్టిబాధలులేకుండ ఉండిననాడే నైజాం మహాశయునకు చిరకీర్తి లభింపగలదు.



## శ్రీమతి చుండూరి రత్నమ్మగారికి 'సంఘసేవాపరాయిణి' బిరుదము

వైశ్య యువతీరత్నమును, ఏలూరు పురపాలక సంఘాధ్యక్షురాలును, జమీందారిణియు, ప్రస్తుత కాంగ్రెసు సత్యాగ్రహమున కారాగార మలంకరించియున్న దేశభక్తురాలు నగు శ్రీమతి చుండూరి రత్నమ్మగారికి ఈ మధ్యనే జరిగిన వైశ్యమహిళాసభలో "సంఘసేవాపరాయిణి" బిరుదమిచ్చి గౌరవించిరని తెలిసి చాల సంతసించితిమి. ఈ బిరుదు ఆమె పట్ల నెంతయు సార్థకమగును. వైశ్యసభవారీ బిరుదప్రదానమామెకుజేసి ఆమె సేవలను గుర్తించుటయేగాక, తమ్ము తాము గౌరవించుకొనిరనవలెను. వైశ్యసంఘమున యిట్టి సేవాపరాయణ లనేకులు ఇంకను బయలుదేరుదురని నమ్మెదము.

Edited by Dr. K. N. Kesari, Printed and Published by Dr. S. Seshagiri Rao, at the Lodhra Press, 15, Westcott Road, Royapettah, Madras.